సంపాదకులు :

బాలాంత్రపు నళినీకాంతరావు
బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

సహకారం :

పాలగుమ్మి విశ్వనాథం
బాలాంత్రపు రజనీకాంతరావు
కురుమెళ్ల వేంకటరావు
వింజమూరి శివరామారావు
కె. వి. రమణారెడ్డి
నిడమర్తి నిర్మలాదేవి
దేవులపల్లి లక్ష్మి
పి. బి. శ్రీనివాస్
వెలమకన్ని సుబ్రహ్మణ్యశర
వింజమూరి ప్రభాకరం
అవసరాల అనసూయా గిరి
వింజమూరి సీతాదేవి
బి. గోపాలం
పి. ఎస్. గోపాలకృష్ణ
పూర్ణచందర్
టి. ఎ. నారాయణన్

పర్యవేక్షణ :

పాలగుమ్మి పద్మరాజు
ఎ. ఎస్. రామన్

# కృష్ణశాస్త్రి

## గేయసంహిత – 2

మంగళ కాహాళి



ఓరియంట్ లాఙ్మన్

ఓరియంట్ లాజ్మన్ లిమిటెడ్

రిజిస్టర్డ్ కార్యాలయం
3-6-272, హిమాయత్ నగర్
హైదరాబాద్ 500 029 (ఆం.ప్ర.)

ఇతర కార్యాలయాలు
కామాని మార్గ్, బల్లార్డ్ ఎస్టేట్, బొంబాయి 400 038
17 చిత్తరంజన్ అవెన్యూ, కలకత్తా 700 072
160 అన్నాసలాయి, మద్రాసు 600 002
1/24 అసఫ్ ఆలీ రోడ్డు, కొత్త ఢిల్లీ 110 002
80/1 మహాత్మాగాంధీ రోడ్డు, బెంగుళూరు 560 001
3-6-272, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029
బిర్లామందిర్ రోడ్డు, పాట్నా 800 004
పాటియాలా హౌజ్, 16-ఎ, అశోక్ మార్గ్, లక్నో 226 001
ఎస్.సి. గోస్వామి రోడ్డు, పాన్‌బజార్, గౌహతి 781 001

© ఓరియంట్ లాజ్మన్ లిమిటెడ్, 1992
ISBN 0 86125 951 3

ప్రచురణ
ఓరియంట్ లాజ్మన్ లిమిటెడ్
3-6-272, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029

ముద్రణ
శ్రుతి కంప్యూటర్ గ్రాఫిక్స్ ప్రైవేట్ లిమిటెడ
చిక్కడపల్లి, హైదరాబాద్ 500 020.

# కృతజ్ఞత

ఇంతవరకూ పుస్తక రూపంలో రాని మా నాన్న గారి రచనలు ఈ నాడు ఈ రూపంలో వస్తున్నాయంటే దానికి ముఖ్య కారకులు శ్రీ బాలాంత్రపు నళినీకాంతరావు గారు. సుమారు సంవత్సరన్నర క్రితం నేను వారి సహాయం అడగగానే సంతోషంగా ఈ పని చేపట్టారు. ఆ రోజు లగాయతూ ఈ రోజు వరకూ నిద్రాహారాలు లేకుండా, అక్కడా ఇక్కడా ఉన్న రచనలు చేర్చి, కూర్చి వాటికి ఈ రూపం ఇచ్చారు. వారికి నా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. వారి ఋణం నేను ఎప్పటికీ తీర్చుకోలేను.

వారికి చేదోడు వాదోడుగా ఉంటున్న శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారికి కూడా నా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాలకి తొలిపలుకు వ్రాసి ఇచ్చిన శ్రీ శ్రీ గారికి నా కృతజ్ఞ తాభివందనాలు.

దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి
(బుజ్జాయి)

"కడలి దరి దాకా
నడచెదము గాక !
చదలోరుగు దాకా
కదలెదము గాక !"

– గీతం 12

# ఆస్వాదానికి ఆహ్వానం

ఇక్షు సముద్రం ఎక్కడుందో నాకు తెలియదు. కాని, ఆపాత మధుర మయిన కృష్ణశాస్త్రి సాహిత్యం సమస్తమూ ఇక్షు రసార్ణవమే. కృష్ణశాస్త్రి పలుకుల్లోని చెరుకు తీపి సాహిత్య రస పిపాసువులకు ఎక్కడో ఉందనుకొనే ఇక్షు సముద్రాన్ని వెదుక్కోవలసిన అగత్యాన్ని తొలగిస్తుంది.

అందుకే పురాణాల్లో పేర్కొన్న ఇక్షు సముద్రం ఎక్కడుంటుందో దాని జాగ్రఫీ జోలికి వెళ్లదలచుకోను నేను. మన యెదుట నిజంగా కృష్ణశాస్త్రి సాహిత్య సమస్తమూ ఉరకలూ పరుగులుగా ఉప్పొంగుతోంది. ఇదే అసలు సిసలయిన చెరుకు రసాల కడలి. 'ఆస్వాదించుదాం రండర్రా!' అని అందర్నీ ఆహ్వానిస్తున్నాను.

ఒకప్పుడు కృష్ణశాస్త్రి కవిత్వం మాత్రమే మాధుర్య 'మా' ధుర్య మనుకున్నాము. ఇప్పుడు మీ చేతిలో ఉన్న పుస్తకాన్ని చూడండి. ఇంకా అచ్చవుతున్న, లేదా అయి సిద్ధంగా ఉన్న సంపుటాల్ని చూడండి. అప్పుడు మాధుర్యం అంటే ఏమిటో మీకే అర్థం అవుతుంది. అప్పుడు వాస్తవంగానే ఒక ఇక్షు సముద్రంలో మీరు ఓలలాడుతారు.

కాని, ఇక్కడో చిన్న విశేషం ఉంది. తినగ తినగ వేము తియ్యనుండు నేమో కాని, అంతా చెరుకు రసమే అయితే మొగం మొత్తేస్తుంది. అందుకే కృష్ణశాస్త్రి చెరుకు సముద్రంలో అక్కడక్కడ మిరియాల పొడి ఉంది. కరక్కాయల కసటుదనం ఉంది. ఇంకా మీరు కోరుకొనే ఎన్నెన్నో మసాలా లున్నాయి.

ఇప్పుడు నా మనస్సు 50 సంవత్సరాల వెనక్కి పోతోంది. 1920 ల ప్రారంభ దినా లవి. ఆ రోజుల్లోనే జమీందారీ కవిత్వాన్ని తోసి రా జని భావకవిత్వం రంగ ప్రవేశం చేసింది. 1910 - 20 ల మధ్య ఈ ఉద్యమాన్ని ప్రారంభించిన వారు రాయప్రోలు, అబ్బూరి. అయితే దీనికి 20 లలో అఖిలాంధ్ర ప్రాచుర్యం ఇచ్చినవాడు కృష్ణశాస్త్రి. బరంపురం నుంచి బళ్ళారి దాకా ఈయన తనవీ, ఇతరులవీ భావగీతాల కవితాగానం చేస్తూ యువ తరాన్ని ఆకట్టుకున్నాడు.

అయితే కృష్ణశాస్త్రిది ప్రతిఘటన లేని విజయ యాత్ర కాదు. మహాపండితు డయిన అక్కిరాజు ఉమాకాన్తమ్ "నేటి కాలపు కవిత్వం" అనే పుస్తకం రాసి, అందులో ఎక్కువ భాగం కృష్ణశాస్త్రినే వెక్కిరించాడు. ఉమాకాన్తమ్ (సంస్కృతపు స్పెల్లింగు చూడండి!) గారికి సంస్కృతంలో తప్ప మరెక్కడా కవిత్వం కనబడదు. నన్నయభట్టును కూడా ఆయన కవిగా ఖాతరు చెయ్యలేదు. నేటి కాలం కవిత్వానికి కాలం కా దనేశా డాయన.

కాని, ప్రపంచం మాత్రం వేరు విధంగా భావించింది. భావ కవిత్వాన్ని ఆ నాటి ప్రధాన శాఖగా గుర్తించింది. ఈ శాఖ ఎన్నో కోకిలలకు ఆశ్రయం ఇచ్చింది. (గౌతమీ కోకిలగా పేరు పొందిన వేదుల సత్యనారాయణ శాస్త్రిని ఇక్కడో చిన్న ఉదాహరణగా ఉటంకించ వచ్చును.) ఈ అన్ని కోయిలలలో అగ్రస్థానం సాహిత్య విమర్శకు లంతా కృష్ణశాస్త్రిదే అని అంగీకరించారు.

"నేటి కాలపు కవిత్వం" ఇప్పుడు లైబ్రరీలలో బూజు పట్టిపోతోంది. కృష్ణశాస్త్రి కవిత్వం భావకవితకు పరా కాష్ఠగా నిలబడింది.

అనంతపంతుల రామలింగ స్వామి అనే ఆయన "కృష్ణ పక్షం" కావ్య సంపుటిని వేళాకోళం చేస్తున్నా ననుకుంటూ "శుక్ల పక్షం" అనే రాతని వెలువరించాడు. దాన్ని కూడా ఇప్పుడు చదివే వా ళ్లెవరూ లేరు. ఆ రోజు ల్లోనే దాన్ని వేదుల "ఈ శుక్ల పక్షం సారస్వ తారిష్టం అనే శుక్ల నష్టం" అని చెప్పి సహృదయుల హృదయ ఫలకాల నుంచి తుడిచిపెట్టి పారేశాడు.

1930 లలో భావకవిత్వం మీద తిరుగు బాటుగా అభ్యుదయ కవిత్వం వచ్చింది. కాలంతో పాటు ఎదుగు తున్న కృష్ణశాస్త్రి అభ్యుదయ కవిత్వాన్ని ఆహ్వానించి ఆశీర్వదించాడు. అంతే కాదు. అభ్యుదయ రచయితల సంఘం వార్షికోత్సవాలలో ఒకదానికి అధ్యక్షత వహిం చాడు.

సినీమా రంగంలో ప్రవేశించి, మళ్లీ ఇలాంటిది రావడానికి వీల్లే దన్నట్టుగా మల్లీశ్వరి రాశాడు.

ఈ మధ్య కాలంలో ఆయన యెన్నో రేడియో నాటకాలు రాశాడు. రేడియో ప్రసంగాలు చేశాడు.

ఆ తర్వాత ఆయన గొంతుక పోయింది. కాగితాల మీద (చిన్న చిన్న నోటుబుక్కుల మీద) అక్షరాలు రాస్తూనే, తన దగ్గరకు వచ్చిన అందరితోనూ ప్రసంగించాడు. ఎన్నో ట్రంకు పెట్టెల నిండా ఈ నోటుబుక్కులున్నా యని బుజ్జాయి (కృష్ణశాస్త్రిగా రబ్బాయి) నాతో చెప్పాడు.

ఒక దానిలో కృష్ణశాస్త్రిగారు నా మీద ఇలా రాశారట: "శ్రీశ్రీ గొప్పకవి. అతని మీద ఈగ వాలినా నేను సహించలేను" అని!

నా మీద వారి కెప్పుడూ సదభిప్రాయమే ఉంది. మరి వారి మీద నాకు వల్లమాలినంత అభిమానం. నా మనస్సు మీద చెరగని ముద్రలు వేసిన ముఖ్యాతిముఖ్యులలో కృష్ణశాస్త్రిని ప్రముఖంగా పేర్కొంటాను.

వారి మీద నా కున్న అభిమానం, అపేక్ష, వారి యీ గ్రంథ సంపుటాలకు గాను ఈ రాత రాయడానికి ప్రేరేపించాయి. మరో మారు చెబుతున్నాను. ఇది ఇక్షు సముద్రం. "అందరం ఆస్వాదించుదాం, రం" డని ఆహ్వానిస్తున్నాను.

మద్రాసు,
29-11-81

శ్రీ శ్రీ

# భూమిక

స్వాతంత్ర్యోద్యమం, ఆంధ్ర రాష్ట్రోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులలో దేశభక్తి గీతాలు పుంఖానుపుంఖంగా వచ్చాయి. "లేదురా ఇటువంటి భూదేవి ఎందు! లేరురా మనవంటి పౌరులింకెందు!", "తన గీతి అరవజాతిని గాయకులనుగా దిద్ది వర్ధిల్లిన తెనుగువాణి" వంటివి. వీటిలో ఇతర జాతులకన్న మన జాతి ఔత్కృష్ట్యాన్ని ఎత్తి చూపే ప్రయత్నం, ప్రజలను ఉత్తేజ పరచి, ఉద్యమానికి పుష్టి చేకూర్చే లక్షణం ఉన్నా, ఈ గీతాలలో కవిత్వం పాలుకన్న, ప్రబోధం పాలు ఎక్కువ.

కృష్ణశాస్త్రిగారి దేశభక్తి గేయాలు మరొక కోవకు చెందినవి. వీటిలో ఉదాత్త కవితా లక్షణం ఉంది:

"జయ జయ జయ ప్రియభారత
జనయిత్రీ దివ్యధాత్రి!" (పుట 3)

"ఆకాశము నొసట పొడుచు అరుణారుణ తార!
ఏకాకి నిశీథి నొడుచు తరుణ కాంతిధార!"

(పుట 10)

"ఎగరెయ్,
ఎగరెయ్,
ఎగరెయ్యవోయ్ జెండా!" (పుట 14)

"ప్రాభాత ప్రాంగణాన మ్రోగేను నగారా!
ఈ భారత భువి పొంగెను ముక్త జీవధార!"

(పుట 15)

"మంది కృత మహాయుగం!
ముం దున్నది ముం దున్నది
ముం దున్నది మందే, మరి
మందే యువ మహాయుగం!" (పుట 34)

ఇటువంటి గేయాలు ఒక ఉద్యమానికి ఉపాంగాలు కాదు, సార్వకాలిక మైనవి.

"జయ జయ జయ ప్రియ భారత జనయిత్రీ" అనే గీతం భారత జాతీయ గీతం కావడానికి కవితా దృష్ట్యా 'జన గణ మన' గీతంకంటె ఎక్కువ యోగ్యత గలది అని భావించిన సహృదయు లున్నారు.

ప్రధానంగా మానవతావాదీ, స్వతంత్రతా ప్రణయీ అయిన శ్రీ కృష్ణశాస్త్రి వసుధైక కుటుంబ భావనతో 'విశాల మానవతా సమతా సాధన'నీ, 'భావి లోక కల్యాణ సుస్థిర స్థాపన' నీ ఆకాంక్షిస్తూ ఆలపించిన దేశభక్తి గేయావళి ఈ 'మంగళ కాహళి'. 'కృష్ణశాస్త్రి గేయ సంహిత'లో ఇది రెండో భాగం.

'మంగళ కాహళి'లో రెండు విభాగాలు - 'విజయ భారతి', 'ఆంధ్ర గేహళి' అని. మొదటిది - భారత జాతీయ గేయ కదంబం. రెండోది - ఆంధ్ర గ్రామీణ జీవన మాధుర్య సంకీర్తనావళి.

'ప్రతిభ', 'జ్వాల' వంటి పత్రికలలోనూ, 'స్వాతంత్ర్య రథం' వంటి శ్రవ్యనాటికలు, మొదలైన వాటిలోనూ చెల్లా చెదరుగా ఉన్న శాస్త్రిగారి దేశభక్తి గేయాలను ఏకత్రితం చేసే ప్రయత్నం ఈ సంపుటం.

'కృష్ణశాస్త్రి గేయసంహిత' సంపాదకత్వం నిర్వహించే అవకాశం మాకు కలిగించిన 'రాజహంస ప్రచురణల' అధిపతి చిరంజీవి బుజ్జాయి (దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రి)కి మేము కృతజ్ఞులం.

సంపాదకులు

# మున్నుడి

కృష్ణశాస్త్రిగారి కవితకు 'పరిచయం' వ్రాయడం సాహసం, వివరణ వ్రాయడం అహంకారం.

అయితే —

ఆయన అడుగు జాడల్లో నడిచిన కాల్పనిక కవితా జీవులు, 'భావకవులు' కొందరు - ఈ సంపుటిలోని కొన్ని గేయాలు రేడియోలో ప్రసార మైనప్పుడు, వీటిని కృ.శా. వ్రాయక పోతే బాగుండే దని - జనాంతికంగా - అనడం నే నెరుగుదును. వారి దృష్టిలో కృ.శా. పవిత్రమూర్తికి వీటిద్వారా రవంత కళంకం అంటిం దని వారి నమ్మకం. అందమైన భావాల్ని అందమైన మర్యాదస్థుల భాషలో, పద చిత్రాలలో చెప్పడమే కాల్పనిక కవిత్వోద్యమపు పరమ లక్ష్య మని వారి సిద్ధాంతం. కాని, భావకవిత్వపు రోజుల్లోనే కృ.శా. పలుకుబడిలో ఒక వైలక్షణ్యం ఉండేది. ఉదాహరణకి "ప్రాత క్రొత్తల కౌగిలింతల ప్రసవ మగు బంగారు కాంతుల" వంటి ప్రయోగాలు కృ.శా. ముద్రతో స్ఫుటంగా ఆ నాటి ఖండ కావ్యాలలో కూడా కనిపిస్తాయి. మరొక రైతే, "క్రొత్త ప్రాతల మేలు కలయిక క్రొమ్మెరుంగులు చిందగా" అంటారు. 'కౌగిలింతలు', 'ప్రసవం' వంటి ఇంద్రియ స్ఫురణ కలిగిన పద చిత్రాలు ప్రయోగించడానికి దృష్టి వైశిష్ట్యం కావాలి. పైన ఉదాహరించిన పంక్తి చదువుతుంటే, షేక్స్‌పియర్ సానెట్స్‌లోని రెండు పంక్తులు గుర్తుకొస్తున్నాయి. 'For, where's she so fair, whose uneared womb disdains the tillage of thy husbandry' వంటి పదచిత్రాలలో ఉన్న సన్నిహిత మైన ఇంద్రియత ఆ నాటి కృ.శా. రచనలలో కూడా అక్కడక్కడ కనిపిస్తుంది.

'ఏడాది పొడుగునా', 'వేణుకుంజం' వంటి పల్లె సీమల జీవితాన్ని చిత్రించే నాటికలలోనూ, విడిగా రేడియో ప్రసారం కోసం వ్రాసిన గ్రామికుల పాటలలోనూ, అంతగా తొలినాటి భావకవి అయిన కృష్ణశాస్త్రి కనిపించడు. కాని ఆ నాడే, కాల్పనిక లోకంలో సంచరించే కవితో పాటు, నేలమీద కాలూది, వెర్రివాళ్ల మొదలుకుని, మేధావుల వరకూ అన్ని రకాల మనుష్యులతోనూ చనువుగా, కులాసాగా తిరిగే సంఘజీవి కూడా కృ.శా.లో ఉన్నాడు. ఈ విషయం ఆయనతో సన్నిహితంగా తిరిగిన అందరికీ తెలును. మని షయితే చాలు, అతనితో సాహచర్యం ఏర్పరుచుకోకుండా ఉండలేకపోయివా డాయన. జట్కావాళ్లతో, కారు డ్రైవర్లతో ఛలోక్తులు విసురుతూ ఉండేవాడు. సాహిత్య సభల్లో, ఆ రోజుల్లో, ఆయన చేసిన ప్రసంగాల్లో ఎన్నో పిట్టకథలు, చమత్కారాలు దొర్లేవి. 'వెంకుబాయమ్మగారి గేది', 'సుబ్బమ్మవ్వ' మొదలైన పాత్రలు జీవం పోసుకుని మెదిలేవి. ఈ సంపుటిలో రెండవ భాగం లోని గేయాలను వ్రాసింది - ఆయనలోని సంఘజీవి అయిన కవి. అయితే కేవలం గ్రామీణ జీవితాన్ని ప్రతిబింబించడమే కాదు, ఆ గేయాల్లో ప్రస్ఫుటంగా కృ.శా. లోని కవి తొంగిచూస్తాడు. 'సెంబైలే జోరు లంగర్' అన్నపాట తీసుకోండి.

'పని చేస్తే పది పైసా లొస్తాయ్
పగ లంతా నూరీడు మేస్త్రీ

\- - - - - -

రేతిరి సెందర వంక జోస్తి' (పుట 72)

అని రోడ్డు కూలీల భాషలోనే కాల్పనిక పదచిత్రాలు దొర్లిం చాడు కృ. శా.

అన్నిటికన్నా నాకు చిత్రంగానూ, హృద్యంగానూ అనిపించేవి ఆయన గ్రామీణ జీవితం చుట్టూ అల్లిన నాటికల్లోని పాటలు.

వాటిలో తెలుగు పల్లెసీమలోని పాత్రలు, వాళ్ల మనస్తత్వాలు, మూర్తులు అతి సున్నితమైన రేఖలలో చిత్రించా డాయన.

'చెప్పు మరదలా .... నీ చెరగు తిరగదేమే బుజం' అనగానే కడుపుతో ఉన్న మరదల్ని ఇంటి ఆడబడుచు ఆప్యాయంగా గేలిచేసే దృశ్యం మన కళ్లముందు మెదులుతుంది.

బిడ్డను నిద్రబుచ్చుతూ ఒక తల్లి పాడే పాటలో, ఒక్క తల్లే కాదు, తెలుగునాటి ఇల్లాలు, అందరి అవక తవకల్నీ సరదాగా, కులాసాగా సహించే క్షమామూర్తి అవతారం దాలుస్తుంది.

"నీ నాన్న కళ్లేమొ బాలల్ల పైని" (పుట 105)

అన్న చిన్న పంక్తిలో భర్తలోని చిలిపితనాన్ని కూడా నవ్వుతూ సహించే ఇల్లాలు రూపం దిద్దుకుంటుంది.

'విజయ భారతి' లోని దేశభక్తి గేయాలు వ్రాసిన కవే 'ఆంధ్ర గేహశ్రీ' లోని పల్లె పదాలు వ్రాశా డన్నది ఆశ్చర్యం కలిగించే విషయం.

కాల్పనిక కవి అయిన కృ.శా. వయసుతో పాటు, అనుభవంతో పాటు పెరిగి, విశాల మయిన మానవతను ప్రతిబింబించే మహాకవి అయా డని నా నమ్మకం.

- పద్మరాజు

# ఇందులో ...

# విజయ భారతి

జయ జయ ప్రియ భారత
జనయిత్రీ దివ్యధాత్రి!

భారత జనయిత్రికి నివాళి పడుతూ, స్వాతంత్ర్యోద్యమాన్ని, శాంతిసమరవిజయాన్ని అభివర్ణించే గీతావళితో కూర్చింది - ఈ 'విజయ భారతి'. పతనాభ్యుదయాలతో ముందుకు సాగిన భారతదేశపు గత చరిత్రను కళ్ల ముందు పలు చిత్రాలుగా పరచి చూపే గేయాలు - చాలావరకు 'మణి కింకిణి', 'మహా మేళవం', 'స్వాతంత్ర్య రథం', 'రాజఘట్టం', 'కొత్త కోవెల' వంటి శ్రవ్యనాటికల నుంచి గ్రహించినవి. నాలుగు 'మహతి' నుంచి, ఒకటి 'పల్లకి' నుంచి తీసికొన్నవి.

★

ఈ జీవిక ఏనాడును ఏ నెరుగను తీరిక
వాడక కలచును నా మది వీడక ఒక కోరిక-

పుడమి నెల్ల లవలేశము విడువక తిరగాలి
అడు గడుగున ఆగి ఆగి అరసి అరసి సాగాలి!

ప్రతి మానవ గేహమునకు అతిథిని కావాలి
ప్రతి ఎదలో నా నెయ్యపు పాలు పోసి నింపాలి!

వసుధను నా వీటిలోన వసుధలోన నా వీటిని
పొసగించి అందరము పొందుగ బతకాలి!

★

# 1

జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ దివ్యధాత్రి !
జయ జయ జయ శత సహస్ర
నరనారీ హృదయనేత్రి !

జయ జయ సస్యామల సు
శ్యామ చల చ్చేలాంచల !
జయ వసంత కుసుమ లతా
చలిత లలిత చూర్ణకుంతల !
జయ మదీయ హృదయాశయ
లాక్షారుణ పదయుగళా !

జయ జయ జయ ....

జయ దిశాంత గత శకుంత
దివ్యగాన పరితోషణ !
జయ గాయక వైతాళిక
గళ విశాల పథ విహరణ !
జయ మదీయ మధుర గేయ
చుంబిత సుందర చరణా !

జయ జయ జయ ....

ప్రహతి

# 2

ఒక నా డీ భువి సకలము స్వర్గము
　　సుకముల సొగసుల సూనారామము
వికచ విభాత శుభామల ధామము
ప్రకట యశోవిలసితము స్వతంత్రము

కులముల మతముల కూడని ఈసుల
అలసత కృపణత అలమిన మనసులు
ఖల పరపన్నగ గాఢ విషాన లా
విలమై, ఖిలమై అలమెను దాస్యము

- 'మణి కింకిణి'

# 3

భారత మానవ మహాపయోనిధి
తీరము నందున నిలిచి,
దూర తపోవన వాటీ పుణ్య స
మీరణ గంధము తెచ్చి,
ధీర ముక్త గంభీర కంఠరవ
దేవదత్తమును పూరించి
ఉదార ఛందమున, పరమానందమున
చేరి కోరి నవమానవ కీర్తన
చేయు కవీ*! నీ వాక్కు లవి
ముందు విని, అవి అందుకొని -
నీ వలెనే తొలినాటి తపసులై,
నీ వలె పురాణ చారణులై
నిలిచిన వింధ్య ధరాధరము,
నిశ్చల నీహా రాచలము -
నీ వలె నిత్యము గానము జేసే
నిభృ తామృత రస వల్లకులు
తపోవనీ జప మాలికలు
అపూర్వ జీవన వాహికలు

---

* రవీంద్రుని గీతం ఆధారంగా వ్రాసినది.

గంగా యమునా గౌతములు
కవేరజా నర్మదలు
వివిధ స్వర తంత్రీ మేళనముగ
వినుచు మానవుని గాథ - - - -

II

విను విను వినువీథి నిండి వెడలు విందము
ఘన పర్వత గుహావదన గళచ్ఛందము !
వినుము తపోవాటుల వెల్వడిన చందము
ఘన పుణ్య నదీ తరంగ చలచ్ఛందము

కా లాలస తరంగిణి పయిని
తేలేన మీ హృదయాలు
బైలందు కనిపించేని ఒక
టొకటై పరచు చిత్రాలు
నీడలలో పలు చిత్రాలు !
అదె భేదించి మేరు పథమ్ము
గిరి వక్షమ్ము మానవధార
ఉన్మా దోచ్చరణ ఘాంకృతులతో
భరతోర్విపై పడె నౌర !

మంగళ కాహళి

యవన హూణులు, శక పఠానులు,
తవిలి మొగలాయీల సేనలు
హెచ్చు సమరోత్సవ జవమ్మున
వచ్చిపడి రీ భారతమ్మున
కనబడవు కేతనచ్ఛాయలు,
కనబడవు రథచక్ర ధూళులు
వినబడవు పటు పటహ కాహళ
భేరికా దుందుభుల మ్రోతలు

## III

కను డదిగో లోహ బద్ధ కఠిన పథముల
అనల మూర్చు రథములపై ఆంగిలేయులు –
నలు వలకుల దొరతన మను వలలు పన్నుచు
దళ దళముల అప్రతిహత దర్పోద్ధతులు!
పణ్యవాహ వాహినులై, ప్రభుతా ముద్రాంచితులై
శూన్యమ్మున కాలమహాస్రోతమ్మున పడిపోయిరి!

'మహామేళనం'

# 4

నీ చరణ తరుణ లా
క్షా చిత్రితము లమ్మ
నీ సుతుల జీవితములు !
నా తల్లి
నిరుపేద జీవితములు !

ఈ బ్రతుకులే తెరచి
ఎగయు మా కోరికలె
సొగు నందె హొరంగులో !
నా తల్లి
రేగు పొడుపు వెలుంగులో !

మన్ను మిన్నే అలమి
మసలు నీ వన్నియలె
మలయు హిమ మకుట ఘృణుల !
నా తల్లి
మరుగు సాగరపు మణుల !

ముల్లోకపుం దెరువు
లల్లు నీ రాగములె

మంగళ కాహళి

నిలుచు అమరుల ఎడదల!
నా తల్లి
కలచు అసురుల బ్రతుకుల!

ఈ కాంతి నెరుగుదురు
ఎల్ల నాడుల వారు
నీ అడుగు పారాణిగా!
నా తల్లి
నిన్ను లోకపు రాణిగా!

నీ కరుణ కెరగుదురు
నీ పదమ్ముల కొసల
తమ తలలు కుసుమాళిగా!
నా తల్లి
తమ ఎదలు నివ్వాళిగా!

- మహతి

# 5

ఆకాశము నొసట పొడుచు అరుణారుణ తార !
ఏకాకి నిశీథి నొడుచు తరుణ కాంతిధార !
జయ పతాక యువ పతాక
వియ దాపగ వెడలు నౌక

యుగయుగాల పీడకలలు, సొగయజేయు సంకెలలు
తెగనివి కావోయి - మ్రోల ధగధగా స్వతంత్ర విభా
తాకాశము నొసట పొడుచు అరుణారుణ తార !

అంతులేని ద్వేషము, విష రోషము, స్వార్థము, మోసము
పంతగించి నిలువవు ఆవంతయేని ; శాంత విభా
తాకాశము నొసట పొడుచు అరుణారుణ తార !

ముందు గలదు మన జాతికి ముక్తి, అమర జీవరక్తి!
క్రింది వెనుక గనక నడువు డందరు ; అభ్యుదయ విభా
తాకాశము నొసట పొడుచు అరుణారుణ తార !

– మహతి

## 6

ప్రురువంపు మా జెండా !
భారతీయుల జెండా !
గరువంపు గగనమే
ఒరసి ఆడెడు జెండా !

నిదురపోయిన జెండా !
నీలి నీడల జెండా !
కొదమ చుక్కల దండ
కొసల మరచిన జెండా !

నగము పోలిన జెండా !
స్వప్న సీమల జెండా !
నందె వన్నెల నిండ
సాగి ప్రాకిన జెండా !

మేలుకొనిన జెండా !
గాలిదారుల జెండా !
వెలుగు పొడుపుకొండ
నిలిచి పిలిచెడు జెండా !

మెరసి పోయెడు జెండా !
మింటి నడిమి జెండా !
తరుణ తరణి కిర ణా
భరణము మా జెండా !

# 7

ముంపడివేయ వేమి? నీ ఎడద జెండా కొసల!
వడగాడ్పు టూరుపో, వలిగాలి కౌగిలో!
నీలాల తేలనీ, ధూళిలో రాలనీ!
ఏలాటి కీ డౌనా, మే లౌనా, ఏ మౌనా!

ఈరేడు లోకాల ఏనాడు ఏలెనో!
ఏ ఆజి మోసాల ఎగసెగసి తేలెనో!
నీ కేల, నా కేల నిలువలే కీ వేళ
ప్రాకులాడే నోయి! రాజరాజుల జెండా!

ఆడేటి నీ గుండె అంధ మృతి అయినదో!
పాడేటి నీ నెత్తు పాషాణ మయినదో!
ప్రమో దైన నీ చేత, పా దైన నా చేత
ఓడిపోయే నోయి యోధు లెత్తిన జెండా!

తారాపథాలలో తన గొప్ప చూపింది
ఖండ ఖండాల జెండా లన్నిటిని ఎంచి
నిను గాంచి తను గాంచి తన మస్తకము వంచి
పనికి మాలినదోయి పార్థు డెత్తిన జెండా!

# 8

స్వాతంత్ర్య రథం! స్వాతంత్ర్య రథం!
అది గదిగో అదె, అదే, అదే
స్వాతంత్ర్య రథం! స్వాతంత్ర్య రథం!

శీతధరాధర సేత్వంతర నర
నారులతో స్వాతంత్ర్య రథం
భారత భూ పత నాభ్యుదయమ్ముల
పడి లేచే స్వాతంత్ర్య రథం....

కానన పట్టణ జనపద ఘనపథ
ముల సాగే స్వాతంత్ర్య రథం
కాంచన ఘంటా ఘణఘణ ఘణఘణ
రణనముతో స్వాతంత్ర్య రథం....

గత హత సాక్షుల గళ విగళ ద్రుధి
రాంకముతో స్వాతంత్ర్య రథం
శతశత మానవ మాంసల భుజ ధృత
పాశముతో స్వాతంత్ర్య రథం....

- 'స్వాతంత్ర్య రథం'

# 9

ఎగరెయ్,
ఎగరెయ్,
ఎగరెయ్యవోయ్ జెండా!
మనదీ,
మనదే,
మన మువ్వన్నియ జెండా!
ఎరుపూ,
తెలుపూ,
పరువంపు టాకు పసుపూ-
దాంతీ,
శాంతీ,
నవజీవన శుభకాంతీ!
పురిపై,
గిరిపై,
ప్రియ భారత భువిపై
ఎగరెయ్,
ఎగరెయ్,
ఎగరెయ్యవోయ్ జెండా!

- 'స్వాతంత్ర్య రథం'

# 10

ప్రాభాత ప్రాంగణాన మ్రోగేను నగారా !
ఈ భారత భువి పొంగెను ముక్త జీవధార !
లేవోయ్ ! లే లే లే లే!
మ్రోగేను నగారా!
పొంగె జీవధార!

చిరదాస్యం పొరపాటు,
పరప్రభుత దొంగప్రేటు –
లేవోయ్! లే లే లే లే !
మ్రోగేను నగారా !

నీ శీర్షం హిమశృంగం
నీ ఎద గంగాభంగం
నీ దేశం, నీదే, నీ
భారత దేశం, మన
భారత దేశం, ప్రజ
లందరి కోసం !

నైరాశ్యం పెను రోగం,
వైరాగ్యం జడ భోగం –
లేవోయ్! లే లే లే లే !
మ్రోగేను నగారా!

నీ మనస్సు సువిభాతం,
నీ రక్తం జలపాతం!
నీ దేశం, నీదే, నీ
భారత దేశం, మన
భారత దేశం, ప్రజ
లందరి కోసం!

మత భేదం చెడు తంత్రం,
మగత నిద్ర ఒక మంత్రం-
లేవోయ్! లే లే లే లే!
ప్రోగేను నగారా!

నీ గతమ్ము మూలధనం,
నీ భావి వసంతవనం-
నీ దేశం, నీదే, నీ
భారత దేశం, మన
భారత దేశం, ప్రజ
లందరి కోసం!

ప్రాభాత ప్రాంగణాన ప్రోగేను నగారా!
ఈ భారత భువి పొంగెను ముక్త జీవధార!

- స్వాతంత్ర్య రథం

# 11

అనవేరా భారత వీరా!
అనవేరా నీ నోరార!
అనవేరా 'స్వతంత్ర భారతం
నా దేశ' మ్మని అనవేరా! అనవేరా....

ముక్త రక్త గళ మెత్తుమురా!
శక్తి వాక్కులం దొత్తుమురా!
పటు శిరాన ఉన్నతము మకుట ము
న్నటుల నిలంబడి అనవేరా! అనవేరా....

కనవేరా భారత వీరా!
కనవేరా నీ కనులార!
కనవేరా భవ దంగణ తోరణ
నట త్పతాకల కనవేరా! అనవేరా....

వివృత దిగంత ద్వారముల
నవలోక ప్రాకారముల
ధగ ద్ధగిత నేత్రమ్ములు రవి శశి
యుగళ మటులుగా కనవేరా! అనవేరా....

చనవేరా భారత వీరా !
చనవేరా పటు జవ మార !
చనవేరా స్వచ్ఛంద భవిష్య
జ్జీవికలం బడి చనవేరా ! అనవేరా....

పొరలె ప్రపంచ రహదారి
తరలె జాతు లుద్ధతి మీరి
కండరముల ఉద్దండము జీవము
నిండి ఊగగా చనవేరా ! అనవేరా ....

# 12

క్రడలి దరి దాకా
  నడచెదము గాక !
చద లొరుగు దాకా
కదలెదము గాక !

ఆ కడలి, ఆ చదలు
ఏక మగు దాక!
చేయి చెయి హాయి నిడి
చేరి విడిపోక !

  కదలెదము గాక!
  నడచెదము గాక!

చీకటుల్ బెదరగా
శృంఖలాల్ చెదరగా
నీకు నే తోడుగా,
నాకు నువు కూడ రా -

  కడలి దరి దాక!
  చద లొరుగు దాక!

మన ప్రభుత, మన ఘనత
కొనితెచ్చు వరకు -
మన గాంధి, మన తండ్రి
మును నిలుచు వరకు -

కనులలో ఒక జ్యోతి
గళములో ఒక గీతి
మన మనసులో మెరయు
ఒక ప్రేమహేతి ! -

## 13

హే భారత జననీ!
స్వేచ్ఛా గగన వీథీ విహారిణి!
స్వతంత్ర కిరణ స్వర్ణారుణ
కంకణ కటక కలాపినీ!

భవ దాశ్రిత వినయ హృదయ
ప్రవిమ లానురాగ మేమొ!
ఉదయాచల సామ్రాజ్వల
పద పాటల తేజ మేమొ!

తావక సేవక జనతా
వికసిత చిత్తామోదమొ!
ప్రాభా తానిల శీతల
పక్షాంచల పరిమళమో!

కవి గాయక వైతాళిక
కంఠ క్రమ గాన మేమొ!
దిశ దిశాంత నవ శకుంత
దివ్యగీతి కామృతమో!

ఇది స్వతంత్ర భరత శాంత
సమర విజయ సమ యోదయ
మిదె జగతీ కల్యా ణో
త్సవ తాండవ కలకలమో!

## 14

ఎత్తండీ! ఎత్తరేం? స్వాతంత్ర్యపు జెండా!
ఎత్తవోయ్! ఎత్తు, ఎత్తు ఆకాశం నిండా!

కే లూపుచు, తల ఊపుచు గాలిదారు లంట
మన జెండా, మనదే, వీరుల నెత్తురు పంట!
కొత్త వేడి, కొత్త వాడి భర తావని నిండ
ఎత్తవేం? ఎత్తు, ఎత్తు ఆకాశం నిండా!
ఎత్తండీ, ఎత్తరేం? స్వాతంత్ర్యపు జెండా!

అర్థ మత్తు, లహంకృతులు, అంధమతులు రాని
నిరుపేదలు, నిర్భాగ్యులు, నిరంకుశులు లేని
కొత్త జగం, కొత్త యుగం భర తావని నిండ
ఎత్త మంటె! ఎత్తు, ఎత్తు ఆకాశం నిండా!
ఎత్తరేం? ఎత్తండీ స్వాతంత్ర్యపు జెండా!

కులం దాటి, మతం దాటి, కొద్ది గొప్ప దాటి
సమ భోగం, సమ భాగ్యం, సమ సంస్కృతి నాటి
కొత్త శాంతి, కొత్త కాంతి భర తావని నిండ
ఎత్తండోయ్! ఎత్తు, ఎత్తు ఆకాశం నిండా!
ఎత్తండీ, ఎత్తరేం? స్వాతంత్ర్యపు జెండా!

స్వాతంత్ర్య రథం

# 15

ఓ హెూ హెూ ! ఓ హెూ హెూ !
నీహా రాద్రికి లంకకు నడుమ నున్న ప్రజలారా !
ఓ హెూ హెూ ! ఓ హెూ హెూ !

ఓ పురాణ పుణ్య ధరిత్రీ జనపద వాసులార !
వినరారా అందరు, మీ రందరును వినండి !
ఇది స్వతంత్ర దివసోదయ మంగళ సమయం !
ఇది భారత శాంతి సమర సుస్థిర విజయం !

ఓ హెూ హెూ ! భారతీయ ప్రజలారా వినరా !
వినరారా అందరు, మీ రందరును వినండి !
ప్రతి నగరం, ప్రతి పల్లీ, ప్రతి గృహమ్ము,
ప్రతి హృదయం
వాకిటిలో జయశంఖా లొత్తండి !
కోస్తా, జిల్లా, బజారు, రస్తా, ఘాట్, బస్తీ, చౌక్
ఇంటింటా మన జెండా లెత్తండి !

ఓ హెూ హెూ ! భారతీయ జనులారా వినరా !
వినరారా అందరు, మీ రందరును వినండి !
గత కాలపు మృత వీరుల కథ లొకపరి తలవండి !
పర దాస్యపు అపహాస్యపు వ్యథ లన్నీ మరవండి !

చిదికి చివుకు జరఠ జగచ్ఛకలమ్ముల చెరపండి !
భావి కాల ముఖ శాలల బ్రదుకులు పరపండి !

ఓహెూహెూ ! భారతీయ జనులారా వినరా !
వినరారా అందరు, మీ రందరును వినండి !
రుజా జరలు దులపండి, భుజం భుజం కలపండి,
'అజేయులం, అమరుల' మని అహం ఇంక నిలపండి !
'ఈ రాజ్యం మనదే - మన కెల్లరకును సమ భోజ్యం'
అనే మాట నోట నోట అందించండి !

ఒహెూ ! ఒహెూ !
నీహా రాద్రికి లంకకు నడుమ నున్న ప్రజలారా !

- 'స్వాతంత్ర్య రథం'

# 16

నిలపండీ దివి, నిలపం డీ భువి
చలింపకుండా మన జెండా!
చలింపనిది, ప్రజ్వలింపనిది ఈ
జగత్తు నిండా ఒక జెండా!
నిలపండీ ...

దురాశ, దుఃఖము, నిరాశ, నీరస
దుర్విష రోషము లిక రావు!
ధరాలయమ్మున దరిద్రతా, అ
స్వతంత్రతా, రుజ లిక లేవు!
నిలపండీ ....

ప్రశాంత మానవ నిశాంతమున నవ
రస స్వర్గమును దింపండి!
సమృద్ధి, సంపద, సమరస సంస్కృతి,
సమాన భోగము నింపండి!
నిలపండీ ....

# 17

అన్నాడు మన తండ్రి గాంధి!
అన్నాడు బుద్ధదేవా క్రీస్తు పైగంబ
రూ ప్రవక్తల కీడు, భారత ఋషుల తోడు!

ఇంటింటిలో దేవు డుంటే
నీవు నేనూ నరుల మంటే
జగతి అంతా ఒకే సంసారమే కదా
ఎవడు హె చ్చెవడు లొ చ్చన్నాడు –
అన్నాడు మన తండ్రి గాంధి....

నిలిచి పోరును సత్య మొకటే
గెలిచి తీరును ప్రేమ ఒకటే
భయముకన్నా వేరు బానిసత్వము లేదు
భరత జాతికి ధర్మ బల మిదే అన్నాడు –
అన్నాడు మన తండ్రి గాంధి....

# 18

నారాయణ నారాయణ! అల్లా అల్లా!
మా పాలిటి తండ్రీ! నీ పిల్లల మే మెల్లా!
నారాయణ ...

మత మన్నది నా కంటికి మస కైతే
మత మన్నది నీ మనసుకు మబ్బైతే
మతం వద్దు, గితం వద్దు, మాయా మర్మం వద్దు
నారాయణ ....

ద్వేషాలూ, రోషాలూ తెచ్చేదే మత మైతే
కలహాలూ, కక్షలు కలిగించేదే గత మైతే
మతం వద్దు, గతం వద్దు, మారణహోమం వద్దు
నారాయణ ....

మత మన్నది గాంధీ జీవిత మైతే
మత మన్నది లోకానికి హిత మైతే
హిందువులం ముస్లిములం అందరమూ మానవులం
అందరమూ సోదరులం
నారాయణ ....

– 'కొత్త కోవెల'

# 19

మృత్యుంజయ ! మృత్యుంజయ !
జయ జయ జయ ! జయ జయ జయ !

మృత్యుంజయ మృత్యుంజయ
నిత్య సత్య గుణాలయా !
మృత్యుంజయ ! దయామయా !
మృత్యుంజయ ! జయా జయా !

స్వార్థము దారుణ మైన
అర్థహీన మృత్యు వైన
మోసము, ద్వేషము, రోషము
మూసి నేల మసన మైన
జరత జగ ద్భువన నరక
భవనమ్మున నవ మంగళ
స్వర్గము నిండించే
సౌఖ్యము పండించే
మృత్యుంజయ ! మృత్యుంజయ ! ....

ఏ ఆవేశము ముంచిన
ఏ ఆగ్రహ మూగించిన

పురుగు నరుడుగా మారెనా
నరుడు అమరుడై తీరునా
ఆ అగ్రహ, మావేశ
మనుగ్రహించు మృత్యుంజయ !
మృత్యుంజయ ! మృత్యుంజయ ! ....

- 'రాజ ఘట్టం'

## 20

అది గదిగో అదిగో! ఆ పైని ఆ పైని
అగుపించు నదె దేవళం-
అదియె మన యాత్రాస్థలం!        అది గదిగో ....

బెదరులేకా, సుంత నిదురపోకా - వేగ
కదిలితే, సందియము వదిలితే-
అట కిపుడె పోగలం!
అదియె మన దేవళం -
అదియె మన యాత్రాస్థలం!        అది గదిగో ....

సత్య ధర్మ దయా శుచిత్వములతో నిండి
ప్రత్యహము మనచేయు కర్మ లన్నీ పండి
శాంత సుందర మైన దేవళం, మానవుని
ఫల సిద్ధి కది తావలం, విశ్వ
మానవుని యాత్రాస్థలం!        అది గదిగో ....

నాల్గు దిక్కుల నడిమి నాడు నాడుల నుండి
నర నారు లందరూ నడవండి, నడవండి!
మూల్గు సందేహమ్ము, మోసమ్ము, కుటిలత,
నీల్గు హింసయు వెనక విడవండి, నడవండి!
అది గదిగో ....

'రాజ ఘట్టం'

# 21

క్రమ్మగా బతికితే గాంధీయుగం - మనిషి
కడుపు నిండా తింటె గాంధీజగం! కమ్మగా....

పరమార్థ మొక్కటే గాంధీమతం
భయము విడనాడుటే గాంధీహితం - మనిషి
భయము విడనాడుటే గాంధీహితం! కమ్మగా....

భోగలోలత విడిన గాంధీవిధం
త్యాగరథ మెక్కితే గాంధీపథం - మనిషి
త్యాగరథ మెక్కితే గాంధీపథం! కమ్మగా....

మనిషి మర్యాదయే గాంధీధనం - బ్రతుకు
మారితే కోవెలగ గాంధీతనం - మనిషి
మారితే కోవెలగ గాంధీతనం! కమ్మగా....

తన కంఠమున దాచి హాలాహలం
తల నుంచి కురిపించి గంగాజలం
మనిషి శివు డవడమే గాంధీవరం - బాపు
ననుసరిస్తే చాలు మన మందరం! కమ్మగా....

– 'కొత్త కోవెల'

## 22

ఓ పథికా! ఓ పథికా!
పదవా ఒకింత ఆగి? నీ
పయనం రవంత సాగి - ఓ పథికా!

నీ చిననాటి ఉషస్సులలో
పూచిన స్వప్నము లేవో ఏవో!
ఆ తొలి నాటి తమస్సులలో
అలమిన తలపులు ఏవో ఏవో! ఓ పథికా!

ఓ పథికా! ఓ పథికా!
అదిగో మరొక్క మజిలీ!
పదవా ఒకింత కదలీ! ఓ పథికా!

చీకటి వెల్గుల కౌగిలిలో
సోకిన వేదన లేవో ఏవో!
ఆశ, నిరాశల లోగిలిలో
చేసిన సాధన లేవో ఏవో! ఓ పథికా!

ఓ పథికా! ఓ పథికా!
ఇదిగో నవీన జగతీ!
ఇక నీ కనంత సుగతీ! ఓ పథికా!

ధారుణి నీ వొక ధీరుడవై
తీరుచు మార్గము లేవో ఏవో !
కూరిమి నిండిన దేవుడవై
కూరుచు స్వర్గము లేవో ఏవో !

ఓ పథికా...

- 'కొత్త కోవెల'

# 23

మ్రుంది కృత మహాయుగం!
ముందున్నది ముందున్నది
ముందున్నది మందే, మరి
మందే యువ మహాయుగం!

కలికాలం — ముసలి ముసలి
చలికాలం — మసలి మసలి
కొండ చిలువలాగ, పెద్ద
బండలాగ దొర్లిపోయె!

బరువుల్లో దొరువుల్లో
ఇరుకు ఇరుకు బిలముల్లో
కునుకు జరఠ కలికాలం
వెనుక నడకల కుళీరం!

పీతలాంటి భూతం మన
తాతల్దీ తండ్రుల్దీ —
రోత రోత రోత! మంది
ప్రాత ర్వ్యయ దావాసం!

ప్రాత రుజ్వ లాకాశం!
భావి మంది రావాసం!

స్ఫీత జీవ ధౌత నాక
నేతలం విధాతలం!
స్ఫీత చలత్ ధౌత లసత్
చేతనులం నూతనులం!

మన కే మిక - మన కే మిక?
మంది కృత మహాయుగం!

- పల్లకి

## 24

పదవో యిక పదవోయీ
ఇది నిజమే అనవోయీ
తరలిం దదె ప్రజారథం
పొరలింది ప్రపంచ పథం          పదవో యిక ....

ఇది మాత్రం నిజ మనవోయ్
తుది సమరం ముగిసిం దని !
రాగల దది శాంతి యుగం
కాగల దభ్యుదయ జగం          పదవో యిక ....

ఇది మాత్రం నిజ మనవోయ్
ముది లోకం పోయిం దని !
ఎదు రైనది సమభావం
పదు నైనది యువజీవం          పదవో యిక ....

ఇది మాత్రం ఇది మాత్రం
ఇది మాత్రం నిజ మనవోయ్
వికసించే విధానమున
మకుటధారి మానవు డని !          పదవో యిక ....

- 'కొత్త కోవెల'

# 25

రావోయి వెనుదీయ నేల చెలికాడా !
  కటికి రా నేల కా లిడగ వెర పేలా ?
మునిమాపు స్వప్నముల ఏరికొనగ
ఏరి కొరకో, ఎందు కొరకో !

రా రమ్ము రా రమ్ము చెలికాడా !
దిగి రమ్ము విడి కలల జాడ

  రమ్ము నడయాడ సామాన్య
  జనులు తిరుగాడు వాడ

# 26

ఒత్తండి జీవన శంఖము !
ఎత్తండి ఠీవిగ శీర్షము !

ఇటు సేతువు, అటు హిమగిరి,
ఈ నడిమిదే మన స్వర్గము ! ఒత్తండి...

జయ మని, నిర్భయ మని, ఈ
జగతి మంగళ మయ మని ఒత్తండి....

అత్తమిలు కనులందు ప్రాకగ
కొత్త చూపుల తీగలు
సత్తు వెడలిన మేన దూకగ
కొత్త నెత్తురు వాగులు ఒత్తండి....

గంగ దరి, యమున దరి, కృష్ణా
గౌతమీ సహ్యజా తటుల, క
ళింగ సాగర తీరములను, అ
రేబి యాంబుధి కూలములను
కోటి భుజములు కోటి చేతులు
కోటి చేతులు కోటి భుజములు
గిరుల శిరముల వంచు నరరే
ఝరుల తెరువుల మలచు నరరే-

జయ మని, నిర్భయ మని, ఈ
జగతి మంగళ మయ మని ఒత్తండి....

ఇల్లు వాడా పల్లి నగరం
కళ్ళు తెరచుక చూచు భళిరే !
మిల్లు గనులూ కారుఖానాల్
ఒళ్ళు విరుచుక లేచు భళిరే !

ఎల్లెడల కేదారములలో
ఎల్లెడల ఆరామములలో
జోరు జోరున అహోరాత్రం
హోరు హోరున అహోరాత్రం
పారగా పరవళ్ళుగా దు
ర్వార భారత కర్మధార -

జయ మని, నిర్భయ మని, ఈ
జగతి మంగళ మయ మని ఒత్తండి....

- 'మహా మేళనం'

## 27

క్రలపండీ చెయ్ చెయ్ - కలపండీ
పదిమందీ బుజం బుజం కలపండీ
చెయ్ చెయ్ కలపండీ

కలిసుంటే మనం మనం, మనం మనం కలిసుంటే
పనిచేస్తే క్షణం క్షణం, క్షణం క్షణం పని చేస్తే
అందరికీ సుకం సుకం, సుకం సుకం అందరికీ!

కొండ రాళ్లు పగల గొట్టి కోన చదును చేద్దాం
కోనలంట దారి తీసి గోదారులు వేద్దాం
కొండ కోన లొంగ దీసి కొల్లలు పండిద్దాం!

కోడికన్న ముందు లేచి కూతెట్టును ఫాక్టరీ
కూడు గుడ్డ వొద్దా మరి కునుకు తుంటె సోమరీ!
పాడుకుంటు పని చేస్తే పది మందికి లాహిరీ
ఆడుకుంటు పని చేస్తే అనిపించదు చాకిరీ!

కలకత్తా కాశ్మీరం కాశీ కన్యాకుమారి
కలిపేద్దాం రైలుదారి కాన కోన రహదారి
కానొద్దాం భూమంతా విమానాల బైలుదేరి!
కలపండీ చెయ్ చెయ్!

- 'కొత్త కోవెల'

# 28

కొత్త కోవెల కొత్త కోవెల
　నాల్గు దిక్కుల నడిమి ఈ ఇల

కొత్త ....

మానవా, నవ మానవా!
నీవు నిలిచిన నెలవె కోవెల

కొత్త ....

నీ దయార్ద్ర కణమ్ము లొలికే
నీ శ్రమాంబు ఝురమ్ము చిలికే
ఎదల లోపల, ఎదల వెలుపల
పదము పదమున పసిడి కోవెల!

కొత్త ....

నీ విలోకన దీపమాలిక
నీ సుహాస విలాస పాళిక
అవతరించిన, అందగించిన
అడుగు అడుగున అలరు కోవెల!

కొత్త ....

– 'కొత్త కోవెల'

# 29

జననీ! నవ జీవన దాయినీ!
కరుణా రస వాహినీ! సరస కళా మోహినీ!

సుందరములు కనువిందులు ముని గణ
బృందార్చితములు నీ చరణమ్ములు
కుంద వకుళ మందారమ్ములతో
డెందమ్ముల కూరిచి పూజింతుము
జననీ! ...

ఎల్లయపుడు చీకటి వెలుగులలో
ఎల్ల లేని సుఖముల సిలువులలో
తల్లి నలుగు నీ నిసువుల బ్రతుకుల
చల్లని నీ చేయి నిమిరి సాకుమా!
జననీ! ....

నీ అడుగుల కడ నిలిచి జననీ!
నీ అనుమతి తలదాల్చి జననీ!
జననీ! నవజీవన దాయినీ!
జననీ! ....

# 30

రండి దయచేయండి పెద్దలు
పండితులును రసజ్ఞులు
పుండరీ కాసనముపై కొలు
వుండె భారతి ఈ సభ! రండి ....

దూరముల చేరువల జీవిత
భారముల సుమ హారములుగా
కూరిచిన నట గాయకులు కై
వారములు గావించి రీ సభ! రండి ....

పసిడి కిన్నెర వీణ తీగల
మిసిమి వ్రేళులు మసలగా
రస ధునీ మాధురులపై పర
వశములై ఎద లూగు నీ సభ! రండి ....

మ్రోల కొలువున అందియలు కడి
యాలు కంకణ కింకిణుల్
లోల గతి మొరయింపగా హృద
యాలు హాయి నటించు నీ సభ! రండి ....

## 31

ఆ దిశాంతము తాకి
ఈ దిశాంతము సోకి
ఆదిశక్తి! నీ కపాల మాల!

ఆ హృదంతర మందు
ఈ హృదంతర మందు
ఈశ్వరీ! నీ చరణ లాస్య శాల!

ఆ దిశాంతము వేల్చి
ఈ దిశాంతము కాల్చి
కాళికా! నీ నిటల నేత్ర కీల!

ఆ హృదంతర మంటి
ఈ హృదంతర మంటి
అంబికా! నీ దర స్మేర లీల!

ఆ దిశాంతము బెదర
ఈ దిశాంతము చెదర
చండికా! నీ భ్రూ విభంగ హేల!

ఆ హృదంతర మాని
ఈ హృదంతర మాని
నా తల్లి! నీ కృపాంభోధి వేల!

## 32

మొదట తోచె పొద పొదపై
　　　తొగరు గన్నేరు
పిదప తోచె తోటంతా పిండిన
　　　కుంకుమ నీరు
అవల తోచె దూర నిశా రథ్యల
　　　చక్రపు హోరు
అంత చరమ శిఖరి నిలిచె
　　　ఎర నెఱ్ఱని తేరు

దిగి రా తేరు ! భగవతి ! దిగి రా తేరు !
జగదంబా ! జగద్ధాత్రి ! దిగి రా తేరు !

మండు కాగడాల బారు ముందు నడువ మహాంకాళి !
　　　దిగి రా ! దిగి రా !
రక్త వసన, రజత దశన, రక్త చలత్ దీర్ఘ రసన !
　　　దిగి రా ! దిగి రా !
క్రూరమతీ ! రుద్రగతీ ! కురవక మాలా ధారిణి !
　　　దిగి రా ! దిగి రా

రక్త రోహిత రసన రజత దశనవున్నై
రక్త మయ రంగములపై భగవతీ !

ముక్త కబరియు కావి ముసుగులో విడి రేగ
రక్త మయ రంగములపై భగవతీ!
దిగి రా! దిగి రా!

ఒక్కపరి ఉత్తుంగ చరమగిరి వేదిపై
ఎక్కి నీ ఖడ్గము తళుక్కు మనిపించి
ఉద్ధత శిరస్త్రాణ ధారిణీ - దిగి రా!
ఉజ్జ్వల తటి ద్భవన వాసినీ - దిగి రా!
అడుగు పెట్టు మహంకాళీ - ఆగ్రహించి రణభూమి!

(చైనాతో యుద్ధ సమయంలో వ్రాసినది)

# 33

శాంతి శాంతి శాంతి!
శాంతింపుము తల్లీ! మా పాలి కల్పవల్లీ!
కాలాంత భయద రూపము గని
జగము లదరె తల్లడిల్లి -

దిగంతాల మందహాస మల్లీ నవ
లతాంతాల మాలిక లల్లి
దివ్య మోహన రూపము
చూప వేమి తల్లీ!

జగ మ్మేల దయా శిశిర సుధా భరిత
కటా క్షేక్షణముల చల్లి
శాంత సుందర మగు రూపము
చూప వేమి తల్లీ!

నీ కన్నులలో నిండే నెన రేదీ తల్లీ?
మా కిక చూపకు మహిషాసుర మర్దన రౌద్రం!
చల్ల నాయెనా ఇక నీ ఉల్లము తల్లీ!
సలలితము నీ రూపము చూప వేమి మళ్ళీ?

## 34

జయ జననీ! జయ జయ జననీ!
ప్రియతమ భారత ధాత్రీ! నేత్రీ!
జయ జననీ! జయ జయ జననీ!

జయ తుషార సిత కోటీరా!
నదీ నదాయత గళహారా!
జయ మదీయ హృదయాగారా!
జయ జననీ!....

జయ శ్యామల శాద్వల చేలా!
కుసుమ లతా కుంతల జాలా!
జయ మదీయ వాంఛా వేలా జయ!
జయ జననీ!....

జయ సహస్ర నర నారీ కోటీ
మనః కుసుమ మంజరీ గళ న్మధు
ఝరీ స్నపిత పద యుగళా జయ!
జయ జననీ!....

# 35

నిలుపుమోయీ తమ్ముడా నీ జెండా
నీహార శిఖర కోటీరపు తురాయిగా!

తరుణ మార్తాండ మండలమునకు నెదురుగా
పరిపంథి తిమిర హృదయములకే బెదురుగా
నిలుపుమోయీ ....

ఆశాంత సీమాంతరము లదర పిలువగా
దేశీయ హృదయాశయమ్ములకు చలువగా
నిలుపుమోయీ ....

గగన నందన వనీ పవనంపు టల గాగ
ఎగసి చదలంటు కలకాలంపు కల గాగ
నిలుపుమోయీ ....

# 36

జగ దంతర దేశ దేశ
జనులారా వినరా?
వినరా ఇక వినరా? - ఇక
వంత లేదు చింత లేదు -
శాంతి శాంతి శాంతి శాంతి!

కాటకముల నలిగినారు -
బూటకముల కలిగినారు
వేడి వేడి నెత్తు టేళ్ళ
ఓడిచి ఇన్నాళ్లు మీరు

ఆస లేవి అంసమ్ముల
మోసికొనుచు మనినారో?
కోరిక లెవి గుండె గుండె
తోరణాల కూర్చినారో?

అర్థ రచిత మహంకార,
మంథ ప్రభుల నిరంకుశత
వ్యర్థ నాశ కారణము, ల
నర్థము లని గ్రహియించే

ప్రజలారా వినరా?
వినరా ఇక వినరా? - ఇక
ప్రజాస్వామ్య లోకమ్మున
శాంతి శాంతి శాంతి శాంతి!

జగ దంతర దేశ దేశ
జనులారా వినరా?
వినరా ఇక వినరా?

# 37

జ్రియ మాయె విజయ మాయె ననుము
గళ మెత్తి కాహళి,
అయు తాయుత దేశ దేశ
నర మందిర గేహళి !

అధికార మధమ కాలము
అతిహేయ మర్ధ మత్తత
పృథివీతలి మాయ మాయె
రణ హింసోన్మత్తత !

గదులై విడి, అరలై చెడి
కలకాలపు లోగిలి
కదియించె ప్రతీచి, ప్రాచి
కలిపి ఒక్క కౌగిలి !

నిరుపేద పురుగు బానిసీడు
తిరుగు పాడు లోకము
పరువెత్తె; ప్రజావళికి ఇంక
నవ మంగళ నాకము !

– 'రాజ ఘట్టం'

# ఆంధ్ర గేహళి

జయ జయ మహాంధ్ర
జనయిత్రీ! శుభదాత్రీ!

మహాంధ్ర జననికి ఆరతు లెత్తుతూ, తెలుగు నేల తీరు తెన్నుల్ని, తెలుగుల బ్రతుకు బాటల్ని కళ్లకు కట్టేట్లు వర్ణించే పాటల కూర్పు 'ఆంధ్ర గేహళి'. తెలుగు జాతి జీవనానికి అద్దం పట్టే పల్లెవాండ్ల పాటలు (పడవ వాళ్ల పాటలు), పొలం పాటలు (శ్రామికుల పాటలు), వేడుక పాటలు (పండుగ పాటలు) వంటివి గ్రుచ్చెత్తిన ఖండం ఇది. ఇందులోనూ చాలా భాగం 'గౌతమి', 'ఏడాది పొడుగునా', 'వేణుకుంజం' వంటి శ్రవ్యనాటికల నుంచీ, గాయనీ గాయకుల నోట్‌బుక్కుల నుంచీ తీసికొన్నవే.

*

నేటి నుండి ఏనాటికి
వీటి తలుపు మూయకు !
కోటి మంది వచ్చినా
చోటున్నది లోన -

ప్రతి రోజూ వత్సరాది
ప్రతి మనిషీ ప్రేమాతిధి
వచ్చిన అతిథిని మాత్రం
ఎచ్చటికీ పోనీయకు !

చెదరనీకు పెదవులపై
చిరునవ్వుల స్వాగతం
ఆరనీకు కనుచూపుల
అనురాగపు ఆహ్వానం

ఎంత చిన్నదో లోకం !
ఎంత పెద్దదో హృదయం !
ఇన్నాళ్లూ ఎరుగవ
ఈ తీయని సత్యం ?

*

# 38

జయ జయ మహాంధ్ర జనయిత్రీ!
జయ జయ మహాంధ్ర జనయిత్రీ!
జయ జయ ప్రియతమ భారతధాత్రీ
పుత్రీ! శుభదాత్రీ!

శ్యామల నవ సస్యాంబరా!
కోమల సుమవల్లీ చికురా!
కదళీ రసాల లాంగలీ చల
చ్ఛద మృదు లానిల చామరా!
సుంద రాతిసుందర వసుంధరా! జయ ....

నీ పూర్వ చరిత స్మరియించి,
నీ భావి ఘనత దరిసించి,
ఇటు మంజీర, అటు వంశధార
ఎలుగెత్తి నిన్ను కీర్తించు
కబరీ కాశ కదంబము లూగ
శబరీ పెన్నలు నర్తించు
మరి మరి కృష్ణా గోదావరీ
ఝరులు తల లూపి హర్షించు జయ ....

ఎల్లర కోర్కులు నిండు ననీ
ఎల్లర మొక సంసార మనీ

అటు తెలంగాణ, ఇటు కళింగాన
అట నట కోస్తా రాయలసీమల
ప్రత్యాంధ్ర మందిర గేహాళి, స
ర్వదా మ్రోగు నీ మంగళ కాహాళి! జయ ....

శ్రీ విశాల మానవతా సమతా
సాధనమే మా మనోరథం
భావి లోక కల్యాణ సుస్థిర
స్థాపనమే మా దృఢ శపథం! జయ ....

ఒక అడు గేనీ చెదరనీము
ఒక క్షణ మేనీ వృథా కానీము
శ్రీ రస్తనీ, శుభ మస్తనీ,
శాంతి రస్తనీ దీవించు! జయ ....

# 39

ఓ ఓ విశాలాంధ్ర జనులార కనరా!
ఓ సారి నా మాట చెవులార వినరా!
మన జాతి మన నీతి మట్టి పా లాయె
మన చేత మన వ్రాత నగుబాటు లాయె!

ఇన్నాళ్ల స్వార్థాలు ఇంక మానండి
ఎన్నెన్నొ భేదాలు ఇక మరచి పొండి
ఒక నాటి ఘనతకై ఉబ్బిపోకండి
ఇక నైన మన జాతి హితము చూడండి!

పదవి పట్టాలకై పడి ఏడ్వకండి
పదవికే పద విచ్చు ప్రతిభ కనరండి
రే యనక పగ లనక చేయి చేయీ కలిపి
మాయ నిద్దుర మాని మంచి కృషి చేయండి!

కోరికల స్వప్నాల తోరణా లల్లండి
గుండె లన్నీ ఒకే దండగా గుచ్చండి
మన కున్న బంగారు బండారు నేలపై
మన ఏటి వలి నీటి పట్టి తిప్పండి

గనులలో వనులలో కారుఖానాలలో
మన కండరాల్ కరగ పనులు చేయండి!
భయ మేది హిం సేది పరపీడన మ్మేది
నయ మార్గమున సదా నడచి బ్రతకండి!

ఎల్ల ఎల్లలు కరగ ఎల్ల కల్లలు సురుగ
ఇల్లన్ని మన ఆంధ్ర స్వర్గమే కట్టండి
మన తల్లికిని తల్లి మన కల్పవల్లి
మన భరత జనయిత్రి మహిమ నిలపండి!

జయ మాంధ్ర జయ మాంధ్ర జనయిత్రి జయహెూ!
జయ మాంధ్ర జయ మాంధ్ర జనయిత్రి జయహెూ!!

# 40

జయ మహాంధ్రజననీ! జయ మహాంధ్రజననీ!
జయ భారతజననీ ప్రియపుత్రీ! శుభ దాత్రీ!
జయ మహాంధ్ర....

నీ ఒడి ఉయ్యాల లూగి
నీ విడు అమృతాలు త్రాగి
నీ నుడి నోరార నేర్చి
నిలిచిన అనుగులము!
కోటి కోటి గుండెల మం
గళహారతి ఇదిగో!
కోటి కోటి గొంతుల కై
వార గీతి ఇదిగో!
జయ మహాంధ్ర....

పాడేనా తెనుగు వీణె పాడాలి!
పండేనా తెనుగు చేనె పండాలి!
మన మావి తోట తోపుల వయ్యాళి
మన ఏటి అలల మూపుల సవారి
మన కేం? మెయి మెయి తాకుచు పైరగాలి
తెనుగు నేల మూల మూల తిరగాలి!
జయ మహాంధ్ర....

# 41

తరలి రారమ్మా !
గౌతమీ, మంజీర, ఓ నాగావళీ, ఓ వంశధారా,
తుంగభద్ర, పినాకినీ, ఉత్తుంగ భంగా కృష్ణవేణీ!
తరలి రారమ్మా !

నురుగులా ముత్యాల చెరగుల
తరగ మడతల పావడాతో
తురిమి సిగలో రెల్లు పూ మం
జరులు ఝరులౌ సోయగముతో
తరలి రారమ్మా !

అవలి దరి ఎలమావి తోపులు
ఇవలి దరి వరిచేల కోపులు
అవల ఈవల చూచుచు, తల
లూచుచు రాయంచ నడకల
తరలి రారమ్మా !

## 42

గోదారీ జోతలో! పాదాల జోతలో!
మా తల్లీ గోదారీ మా లచ్మీ జోతలో!

పడమటింటి కోన బుట్టి
పల్లాలా అడుగు బెట్టి
పాపికొండ లోయ గొట్టి
బద్రాద్రి దాపులో
పట్టీసం సుట్ట బెట్టి,
కోన సీమ తోపులో
పాయ పాయ లైనావా!
పాడి పంట లిచ్చావా!
పైడి పంట లిచ్చావా! గోదారీ ....

పాలపిట్ట, గువ్వజంట,
పావురాయి కూత లంట!
అవ లొడ్డున, ఈవ లొడ్డున
తెల్ల రెల్లు పూత లంట!
అద్దరినీ, ఇద్దరినీ
పైరుసేల కోత లంట!
సూసుకుంట మెచ్చావా
రాసుకుంట వచ్చావా? గోదారీ ....

– 'గౌతమి'

## 43

తానాన తాన తందాన - తాన తందాన

ఆంధ్ర దేశమున అయ్యలందరూ దానకర్ణు లండీ
ఆంధ్ర దేశమున అమ్మలందరూ అన్నపూర్ణ లండీ

అది గది గదిగో తెలుగు తల్లి మన పాలి కల్పవల్లి
అది గది గదిగో తెలుగు తల్లి అందాల పాలవెల్లి
దక్షిణ దేశపు ధాన్యలక్ష్మి మా తల్లి తెలుగు తల్లి
అక్షయ సంపద కాలవాల మీ అమ్మ తెలుగు తల్లి

ఆ తెలుగు తల్లి మెడ తారహారమే గౌతమి గోదారీ
గోదావరి ఒడిలోన కులికే బిడ్డ కోనసీమ
పాడి పంటలా పైడిరాసులా నాడు కోనసీమ

కొబ్బరి తోటల దారులూ .... సై
పోక తోపులా బారులూ .... సై
పచ్చ పచ్చనీ పైరులూ .... సై
పనసా అరటీ తీరులూ .... సై

దేవలోకపు పూవు తోటలకు
ఈడు కోనసీమ, జోడు కోనసీమ

అది గది గదిగో తెలుగు తల్లి మనపాలి కల్పవల్లి
అది గది గదిగో తెలుగు తల్లి అందాల పాలవెల్లి

దేశ దేశాలకు రాణిరా .... సై
కళల కెల్ల రాజధానిరా .... సై
తెలుగు భాష దివ్యవాణిరా .... సై
తెలుగు వాడె అభిమానిరా .... సై

- 'గౌతమి'

## 44

ఎయ్‌రా ఏసెయ్‌ర గడ
తొయ్‌రా తోసెయ్ పడవ
గోదారీ మేట ఏసెరా !

ఆ కాడ లంకరా, ఈ కాడ వంకరా
కొవ్వాడ గొరవంకరా -
చిరుగాలి తోలెరా, తెరచాప ఇప్పరా !

ఆ - కోరంగిరేవూ, తూరంగి మావూ
ఆడుంగి అలిసుం దది రొయ్య, అది జెల్ల,
అది బొచ్చి - ఆడ వల ఎయ్యరా, ఇది ఇలస,
ఇది పొలస, ఇది గిలస - ఈడ వల ఎయ్యరా !

సిన్నమ్మ గంపలోకి సేటెత్తి పొయ్యరా,
సిట్టమ్మ తట్టలోకి బుట్టెత్తి పొయ్యరా !

బలే - వాలు కళ్ళ దానికైతె వాలువ లిచ్చెయ్యరా,
జారూ జడ దానికైతె సందువ లిచ్చెయ్యరా !

మల్లాలా సత్తి కైతె, రెల్లు పూల గుత్తికైతె,
ఎన్నెల పూవత్తికైతె ఎన్నేనా ఈయరా !

జోరు సెయ్ బారు సెయ్
కోరంగి రేవుకీ, కోటిపల్లి రేవుకీ

మావీ తోటా కాడ మల్లమ్మ కూకుంది
పోనీరా !
కొబ్బారి తోట కాడ కోటమ్మ కూకుంది
పోనీరా !
నా ఇంటి ముంగిట్లొ నా పెళ్లాం నిల్సుంది
పోనీరా !

# 45

స్నేపలు సెట్లెక్కేస్తాయ్ - కోపం వొచ్చి!
సేతికి మీసా లొస్తాయ్ - మొగతనc వొచ్చి!
సింత బొర్రలో నావ సిక్కడిపోతుంది -
సిగ్గొచ్చి!

లిల్లే! లేలిల్లే! లిల్లే! లేలిల్లే!
ఇల్లాగే కూసుంటా పిల్లొచ్చిందాకా!

జెల్లకొంకు, మట్ట గిడుసు
సేదు పరిగె, రొయ్యపీసు
ఇసిక దొందు, బొమ్మిడాయి
ఎయ్‌రా! వల ఏసెయ్! ఎర్రి పీనుగా!
సీకటయే లోగా ఎదవ నారిగా!
లిల్లే! లేలిల్లే ....

తాసు పాము నా గుండీ దాని జడ!
కాటేస్తే సస్తావూ - ఎయ్‌రా గడ!
మొగిలి పొత్తు నా గుండీ దాని మెడ!
పొడిగొడితే ఏడుస్తావ్ —ఎయ్‌రా గడ!
ఎనక నుంచి నూస్తేనే ఏడు పొస్తుంది -
దాని జడ, దాని మెడ! ఎయ్‌రా గడ!
లిల్లే! లేలిల్లే ....

# 46

ఐలెస్సా! ఓలెస్సా! ఓ...
ఐలెస్సా! ఓలెస్సా!

ఆకాశం ఒరిగింది
ఆ కడలి పొంగింది
చిరుగాలి వీచింది
తెరచాప ఊగింది ఐలెస్సా....

ఆ గాలి మా తండ్రి
ఈ ఏరు మా తల్లి
ఆ మబ్బు మా అన్న
ఈ కెరటం మా చెల్లి ఐలెస్సా....

అద్దరిని వరి చేలు
ఇద్దరిని రెల్లు పూలు
పాలపిట్ట గువ్వ లంట
పావురాయి జంట లంట ఐలెస్సా....

# 47

గుండెల్లో నిండాలి కులాసా!
ఉండాలీ మనసులో దిలాసా!

ఐలెసా అంటూ నావ
అలలమీద వదలాలి!
ఓలెసా అంటూ నావ
గాలిదారి కదలాలి! గుండెల్లో....

గాలికి కోపం రానీ,
కడలికి వెర్రెత్తనీ!
గాలి కడలి ఏకమై
బైలంతా రేగనీ!
గాలి జూలు పట్టేదీ,
కడలి నడగ ద్రొక్కేదీ
కనపడని సరం గొకడే
కనపడని సరంగు! గుండెల్లో....

చీకట్లో వెన్నెల్లూ చిలికే దెవరు?
నీళ్లల్లో దారుల్లు నిలిపే దెవరు?
అసలు పడవ నడిపేదీ,
అవలి ఒడ్డు చేర్చేదీ
అగపడని సరం గొకడే
అగపడని సరంగు! గుండెల్లో....

# 48

వినవమ్మా చెల్లెలా!
  గుణభద్రా! తుంగభద్ర!
వినవా నా చెల్లెలా?

గంగా యమునల తోడు,
గౌతమికే సైదోడు!
తుంగభద్ర నిలుచు నాడు
బంగారపు వీడు! వినవమ్మా....

గాలులా ఉయ్యాల లూగు
వేళలు చనె నమ్మా!
బాలవై నయ్యాట లాడు
ప్రాయ మేగె నమ్మా! వినవమ్మా....

పోయిన జీవనం మళ్ళీ
పొందవు సుమ్మా చెల్లీ!
ఈ ఇల పండించుటయే
నీ ధర్మము తల్లీ! వినవమ్మా...

పొంగవు, ఉప్పొంగవు కడు
పుణ్యశీల! దయాలోల!
రంగ దాంధ్ర కర్ణాట ధ
రాంగన ముత్యాల మాల! వినవమ్మా....

– 'ఏడాది పొడుగునా'

## 49

ఎయ్యారా ! అడు గెయ్యారా ! ఎయ్ !
ఎయ్యారా ! అడు గెయ్యారా ! భాయ్ !

నాగార్జున కొండకాడ
ఆగిందిర కృష్ణయేణి
నిలిసిందిర కృష్ణయేణి
పిలిసిందిర కృష్ణయేణి ఎయ్యారా ....

ఎయ్యకుంటేం? ఎయ్యకుంటేం?
ఎయ్యకుంటే మించిపోతది -
మించిపోతేం ? మించిపోతేం ?
ఏరులాగ కాలం ఎళ్ళి పోతది -
ఎళ్ళిపోతేం? ఎళ్ళి పోతేం?
ఎళ్ళిపోతే మళ్ళి రాదు
ఏటికన్న దురుసైన బతుకు
ఏటికన్న ఇలవైన బతుకు ఎయ్యారా ....

కొండకాడికే ఎడదామా, మన
కండరాలు కరిగిద్దామా !
కొండరాలతో వడ్డాణం మన
కృష్ణయేణికి కడదామా ! ఎయ్యారా ....

ఆప లీవలికి కాలవలు తవ్వాలి
అందాల కృష్ణమ్మ చేతు లల్లె
అందాల కృష్ణమ్మ సాగితే మోగాలి
మందంగ కెరటాలు అందె లల్లె
ఎయ్యారా....

పంట కాలవలు బీళ్ళకు
ప్రాణాలు వరిమళ్ళకు
పాయసమే మన తిళ్ళకు
బంగారం మన ఇళ్ళకు
ఎయ్యారా....

పైరు కోక కట్టి నేల
పచ్చగ ఉండాలి
దారి పొడుగునా దివ్వెల
తోరణాలు వెలగాలి
వాట మైన యంత్రాలు
నీటుగ తిరగాలి!
ఎయ్యారా ....

# 50

సెంబైలే జోరు లంగర్
సెంబైలే జోరు లంగర్
జోరు లంగర్ - రోడ్ రోలర్
సాంబయ్యా ! ఓ సన్నాసీ !
సవటల్లారా ! లాగండేస్ !          సెంబైలే....

తొర తొరగా కా రెక్కొ
దొర ఎల్లాలీ లాగండేస్ !
తొర తొరగా బం డెక్కొ
బరు వెల్లాలీ లాగండేస్ !

ఎంకయ్యా ఏం జెయమంటావ్ ?
కంకర మీదా కా శ్శీడుస్తాయ్ !

కడవల తోటీ నీళ్ళోసీ
కంకర గింకర తడిపేద్దాం !
కడవల తోటీ సెమటోసీ
వంకర టింకర సరిచేద్దాం !

పని చేస్తే పది పైసా లొస్తాయ్-
పగలంతా సూరీడు మేస్త్రీ !
పని జేస్తే పది పైసా లొస్తే -
రేతిరి సెందర వంక జోస్త్రీ !

ఔరా! ఔరా! మన్నోళ్ళబ్బాయ్
ఔరా ! ఔరా ! మన్నోళ్ళ సుబ్బాయ్

గుమ్మంకాడ పెళ్ళాం పిల్లా
కూకుంటారు మన కోసం -
దమ్మిడి గిమ్మిడి పైసా గియిసా
తెమ్మంటారు పిల్లా జెల్లా!

ఎయ్‌రా సిన్నోడెయ్‌రా!
ఎయ్‌రా ! నీ జీరు గాలా!
ఎయ్‌రా ! నీ బారు కూలా !

## 51

తెల్లవారక మున్నె కళ్లు తెరిచీ - కళ్లు తెరిచీ
కళ్లు తెరవక మున్నె ఒళ్లు విరిచీ - ఒళ్లు విరిచీ
పరమ శివు కీర్తించు మరి మరీ మరి మరీ
మన స్వర్ణ ముఖరీ, ఈ స్వర్ణ ముఖరీ !

మా అయ్య అడుగు తామర నిండి పొరలేటి
మకరంద లహరి మన స్వర్ణ ముఖరీ
మన స్వర్ణ ముఖరీ ....

జ్ఞాన ప్రసూనాంబ చల్లనౌ మది కరిగి
కాన కోనా పొరలి కరుణా సుధా ఝరీ
మన స్వర్ణ ముఖరీ ....

- 'శివక్షేత్ర యాత్ర'

# 52

పురహరా! హర! వికస్వర దృక్చర ద్దయో
దార ధారర వంశధార!

లోల కరముల, విలులి తాళి రవముల నెత్తి
వేగుబోకకు మున్ను
వేయి విధముల నన్ను
పే రెత్తురా, పిలుచు నౌరా!

నీలగళ! నీ చరణ యుగళ నీరజ గళ
న్మధు ధారరా వంశధార!

క్రోలు కొలదీ, మునిగి తేలుకొలది మనసు
తాళనేర్వదు, బాళి
నోర్వజాలదు హరా!
కైలాస గిరి ఎంత దవ్వురా!

– 'శ్రీముఖ లింగం'

# 53

కొండల దొంక పల్లె - అది ఏడైతేనేం?
తెలుగు నాట ఉంది - అది యాడుంటేనేం?

ఊళ్ళో పదిమందీ చెమటోడ్చే వారైతే
ఊళ్ళో పదిమందీ కలిసుండే వారైతే
అది ఏడైతేనేం? అది యాడుంటేనేం?

కాలువ ఒడ్డున ఒదిగి నీడ చూసుకొనేదో
చేల నడుమ పడుచులాగ చేయెత్తి పిలిచేదో
కొండ పక్క నిలిచేదో
తోట వెనక కాస్త కాస్త తొంగి తొంగి చూసేదో
ఏదో ఒక పల్లె - అది యాడుంటేనేం?

కష్ట సుఖాలూ కలుములూ లేములూ
కలిమి లేములూ కరువులూ బరువులూ
ఏ వొచ్చిన గానీ ఎండలై వానలై
ఎదురొచ్చిన గానీ వెన్నెలై చీకటై
నిలబడె నా పల్లె చిరకాలం నుండి
అది ఏడైతేనేం? తెలుగునాటి పల్లె
అది యాడుంటేనేం?

'ఏడాది పొడుగునా'

## 54

తెల్లారక మునుపే మా
పల్లియ లేస్తుంది !
పల్లెలోన ప్రతి ఇల్లు
కళ్ళు తెరచి చూస్తుంది !

చల్ల తరిచి తరిపి వెన్న
గొల్ల పడుచు తీస్తుంది !
ఘల్లు ఘల్లు మని అందెల
సందడి వినిపిస్తుంది !

కర్రి ఆవు పొదుగు కరిగి
కడివెడు పాలిస్తుంది !
జుర్రు మంట త్రాగ మంటు
తల్లి పిల్ల కిస్తుంది !

తుర్రు మంటు వాడ లేగ
దూడ ఉరక లేస్తుంది !
మర్రిచెట్టు నీడ అల
మంద ఆగి చూస్తుంది !

## 55

వానదేవుడా ఓ వానదేవుడా!

రాణితోను రావయ్యా వానదేవుడా!
రాజు లాగ రావయ్యా వానదేవుడా!

మిన్నంతా నీ తేరు వాన దేవుడా!
మేఘాలు గుర్రాలు వానదేవుడా!

మెరుపులైతే జెండాలు వానదేవుడా!
ఉరుములైతే బాజాలు వానదేవుడా!

దగ పుట్టి భూదేవి వగరుస్తు చూస్తుంది!
కడుపులోని పంటలు పైకి తీసి ఇస్తుంది!

జాలి పుట్టి రావయ్యా వానదేవుడా!
చల్లన్ని నీ రియ్యి వానదేవుడా!

ఏళ్ళకి కాళ్ళొచ్చి మళ్ళ పైకి పాకాలి!
చెరువులకీ వాళ్లొచ్చి నేల పైకి దూకాలి!

- 'ఏడాది పొడుగునా'

# 56

ఏరువాకమ్మకీ ఏమి కావాలి?
  ఎఱ్ఱ నెఱ్ఱని పూల మాల కావాలి!
ఏరువాకమ్మకీ ఏమి కావాలి?
ఎరుపు తెలుపుల మబ్బు టెండ కావాలి!

కాపు కఱ్ఱుచ్చుకొని గట్టున నిలవాలి!
కొడుకు మేడుచ్చుకొని కొంఢ్ర దున్నాలి!
బసవన్న తల ఊచి పాటు చెయ్యాలి!
పాలేరు పండించి వండుకోవాలి!

ఏరువాకమ్మనూ ఏమి కోరాలి?
గరిసెలందూ కొత్త సిరులు నిండాలి!
కొట్ల లోపల కొత్త కొలుచు నిండాలి!
నట్టింట మహాలక్ష్మి నట్టు వాడాలి!
పాడి పంటలు కోరి పరవశించాలి!

- 'ఏడాది పొడుగునా'

## 57

ఏం సొగసో ఈరమ్మది!
ఏం సోయగ మీరమ్మది!
కందిరీగ వంటి నడుం!
కదురు లాంటి ఒళ్లు!

మందంగా గోవులాగ
మళ్లదారి నడుస్తుంటె
మలుపుదారి నడుస్తుంటె
ఏం అందం - ఏం చందం!

గట్టు కవల అరక దున్ను
అయ్యకు బువ్వట్టుకునీ,
పట్టెడు కాటుక కళ్లకు
పుట్టెడు పూ లెట్టుకునీ,

ఈర మ్మొడు తుంటే -
పైరు చేను చూసి చూసి
పరవశమై ఊగేది
శిరసు వంచుకునేది!

పైరగాలి సరదాగా
పడుచుబుగ్గ నిమిరేది!
ఏం వొయార మీరమ్మది!
ఏం సోయగ మీరమ్మది!

సెనగపూలు తురిమీ - అవి
సిగపాయల పెట్టుకునీ
సెనగకాయ విదిమీ - అది
సిలిపిగ నోట్లేసుకునీ

అవుకు నీ రెట్టేదీ
అవు దూడ తోలేదీ! ఏం సొగసో....

'వేణు కుంజం'

# 58

చువ్వీ చువ్వన్న లాలో, చువ్వన్న లాలో! చువ్వన్నలాలో!
ఊడుపు లూడుద్దాము ఓ లమ్మలాలో, ఓ లమ్మలాలో !

మళ్ళనిండ పంటకాల్వ నీళ్లు నింపిందా, నీళ్లు నింపిందా?
వాన గాని కురిస్తేను వజ్జర పోతుందా, వజ్జర పోతుందా?

దుక్కలాంటి పొలేరు, దుంగలాంటి పాలేరు
చెక్కా ఎక్కేడో, చెక్కా పట్టేడో !
మొదు లెట్టి మంగమ్మ మును(వు పెట్టిందో,
మును(వు పెట్టిందో !

ఊసులాడు కోకండి, కీసులాడు కోకండి
మీసాల కాపు కాసున్న డమ్మో, కాపున్న డమ్మో !

ఒళ్ళు వొంచి పని చేస్తే ఒరిగే దే(వుంది, పెరిగే దే(వుంది?
ఊ( అంటె ఆ( అంటె వొచ్చే రోసాలు,
వొచ్చే రోసాలు
అయ్యకైతె ఉన్నాయి రొయ్యా మీసాలు,
రొయ్యా మీసాలు !

# 59

గున్నాసారి గున్నమ్మ !
   ఓ గున్నసారి గున్నమ్మా !
ఊడుపు లూడ్చే కాడ నీకు
ఒడినిండా పసు పెందుకే ? గున్నాసారి గున్నమ్మా !
గొప్పు తవ్వే కాడ నీకు
కొత్త పంచె లెందుకురో ? కోరమీసం కోటయ్యా !
బందలో నిలిసే కాడ నీకు
సందా లందెలు ఎందుకే ? గున్నాసారి గున్నమ్మా!
చేలూ దున్నే కాడ నీకు
వాలూ గోసీ లెందుకురో? కోరమీసం కోటయ్యా!
కలుపూ తీసే కాడ నీకు
కంటికి కాటికి ఎందుకే? గున్నాసారి గున్నమ్మా !
కత్తువ బట్టే కాడ నీకు
కాశీ కోక లెందుకురో? కోరమీసం కోటయ్యా!
మద్దేన్నం మరి దప్పికేస్తే
సల్దీ గెంజీ తాగేవో? గున్నాసారి గున్నమ్మా !
కొండెక్కేనూ సూరీడూ
ఎండెక్కేనూ కోటయ్యో ! కోరమీసం కోటయ్యో !

– 'ఏడాది పొడుగునా'

## 60

రండి రా రండి కనరండి కనులారా!
రైతు జనులారా! మోతుబరులారా!
పదండి నడవండి బూదేవి సల్లని తల్లి
రైతు జనులారా! మోతుబరులారా!

గోదారి గంగమ్మ గొప్ప ఇల్లాలు
ఆ దేవి సల వుంటె అదె మాకు సాలు
నిండు చూలా లల్లె పండి వొరిగే సేలు
దండిగా రాలు బంగారు ధాన్యాలు
గరిసెల్లు పండగా గాదుల్లు నింద
రండి రా రండి....

పండేటి గరిసెల్లు పదివేలు తెచ్చు
పెదకాపు కిచ్చు
మా బాబు కొరిగితే మా కేమి వచ్చు?
మా బతుకు లొచ్చు!

ఊఁ అంటే ఆఁ అంటే ఉప్పాడ కోక, ఉల్లిపొర రైక
కూ లంటే నా లంటే కోప తాపాలు, కోర మీసాలు
అయ్యగారికి లేవు వావి వరసాలు
రొయ్యకైనా లేవు అయ్య మీసాలు
రండి రా రండి ....

— 'గౌతమి'

# 61

ఎద్దు లైతే తొక్కేశాయీ!
ఎన్నెలా పొడు గెక్కేశాయీ!
దున్న లైతే తొక్కేశాయీ!
దిన్నెలా పొడు గెక్కేశాయీ!
హొలియో! హొలియో! హొలియో!
వొలియో! వొలియో! వొలియో!
రార పైరగాలి దారీ స్వారి చేస్తూ!
హొలియో! హొలియో! హొలియో!
హొలి హొలి హొలి హొలి హొలియో
వొలి వొలి వొలి వొలి వొలియో!

గలగల సందల కులుకులో
తళతళ అందెల తళుకులో
పిలిచిన పరువున బిరబిర తొరతొర
రావయో! రావయో! రార పైరగాలి దారీ!
కామమ ఎత్తే పళ్ళిక
రామయ పట్టే పళ్ళిక
గాలికి ఎదురుగ ఎత్తితే
వాలుగ వీలుగ ఎత్తితే
రాలెను నేలకు జలజల జలజల
రాసులూ! రాసులూ!

– 'వేణు కుంజం' (నూర్పుల పాట)

# 62

ఓ ఎలకా! చిట్టెలకా!
ఊరికే చూస్తా వెందుకు?
ఉలి కులికి పడతా వెందుకు?

"వరిగింజ కోసం మా వాడు
వరిచేను కెళ్లాడు మా వాడు
వలలోను సిక్కాడా - వడిసెలకు దక్కాడా?
మా వాడు రాలేదు!"

ఓ లేడీ! ఓ లేడీ!
ఊరికే చూస్తా వెందుకు?
ఉరకల్లు వేస్తా వెందుకు?

"ఏటి ఒడ్డుకే మావాడు -
నీటికై వెళ్లాడు మావాడు!
వేటకా డొచ్చాడా - ఈ టైన విసిరాడా?
మా వాడు రాలేదు!"

ఓ పెళ్లి కూతురా!
ఊరికే చూస్తా వెందుకు?
ఉసు రుస్సు రంటా వెందుకు?

"ఊరేదొ వెళ్లాడు నా మగడు -
దూరాన ఉన్నాడు నా మగడు!
గోరింకనె చూశాడొ - నెలవంకనె చూశాడొ?
మా వాడు రాలేదు !"

- 'ఏడాది పొడుగునా' (దంపుళ్లపాట)

## 63

ఎవ రాతపడుచమ్మ - ఎవ రాతపడుచు?
ఏరుదా టొచ్చింది ఎవ రాతపడుచు?
కుచ్చులా పల్లకిని కూర్చున్నదీ - లోన
అచ్చంగ రాణిలా అమరున్నదీ!
పరుపు బాలీసుపై ఒరిగున్నదీ!

అన్నలైతే పసిడి అందె లిస్తారు,
తమ్ములైతే వేలు సొమ్ము లిస్తారు;
పెట్టి పోసేవారు పుట్టింటి వారు,
పుట్టింటికే తాను పురిటి కొచ్చింది!

మరదళ్లు అడుగులకు మడుగు లొత్తేరు,
వదినల్లు కనుసన్న ఒదిగి మెదిలేరు;
గౌరవానికి గాని, ఘనతకు గాని
తన పుట్టినింటిలో తాను దొరసాని!

అబ్బాయి తాతయ్య అంక మెక్కేను,
అమ్మాయి అమ్మమ్మ చంక కెక్కేను;
తన పుట్టినింటిలో తాను దొరసాని,
మగనింటిలో ఉంటె మగువ యువరాణి!

- 'ఏడాది పొడుగునా'

## 64

"స్వారమ్మా పేరమ్మా చూశారమ్మా?
ఔర! పెళ్ళంట మన నారిగాడికి!"
"ఆఁ! నారిగాడికా?"
"ఊఁ! నార్రిగాడికే!"
"ఏ ఊరో?"
"గుంటూరు!"
"కోదండం కూతురే - గోవిందమ్మా"
"మేనరికంటే?"

"మెల్లకంటి కై దెకరాల్
పల్లపు చేనుకి చెల్లు!"

"కట్నాలూ కానుకలూ
కావలి సొచ్చాయా?
బోలెడంత చదువు చదివి
పొయ్యే కాలమా?"

"మొగుడి కన్న పెళ్ళామే
మూరెడు పొడుగు,
కావలిస్తే ఆ సంగతి
కాంతా న్నడుగు!"

- 'ఏడాది పొడుగునా' (ఊరి బావి దగ్గిర)

# 65

"ఏమయ్య రామయ్య ! ఏమి నేశా వయ్య?"
"మొగిలు వన్నె మేలి ముసుగు నేశా నోలె"
"మొగిలు వన్నె మేలి ముసు గెవరి కయ్యా?"
"పెద్దింటి చిలకమ్మ పెళ్ళికూతురి కోలె"

"ఏమమ్మ సీతమ్మ! ఏమి నేశా వమ్మ?"
"పాలపిట్టా వన్నె పంచె నేశా నయ్య"
"పాలపిట్టా వన్నె పంచెవరి కమ్మా?"
"పెద్దింటి సిన్నయ్య పెళ్ళికొడు కయ్యో!"

"పసుపు చీరకు తెస్తి పైఠాణి ఓణి -
తల ఎత్తి నవ్వవో చిలక నా రాణి!"
"జల్తారు సరిగంచు చాపు తెచ్చాను -
ఓరగా చూసేవా ఓయి నా రాజ!"

# 66

మొయ్యర అమ్మోర్ని మొయ్!-
మెల్లగ - ఆఁ - మెల్లగ!
మేనా పల్లకి మొయ్యర!

పాట వింటూ ఊగెరా
ఆఁ - పైర గాలికి పువ్వులా!
దాటుకుంటూ సాగెరా
ఆఁ - ఏటి నురగల పిట్టలా!

ఆఁ -పైరగాలికి పువ్వులా
ఆఁ - ఏటి నురగల పిట్టలా మొయ్యర....

జారెరా ఒయ్యారి కలలూ
దోర పెదిమెల నవ్వులా -
మొయ్యరా! దారాన ముత్యం
మోస్తరు - అమ్మోర్ని మొయ్!

ఉయ్యాలలా ఒయ్యారముగ
మొయ్యోస్! పల్లకి మొయ్!
మనపాట వింటూ కరిగెరా
మంచు తడిసిన చక్కరా!

ఏటికెరటం అంచుపై దూ
కేటి సెందర వంకరా!
ఏటిపై నెలవంకరా - గెం
తేటి పిల్లా జింకరా!

దిలాసగా మొయ్యండిరా!
కులాసగా మొయ్యండిరా!
పెళ్లికూతురు కళ్లనుంచీ
త్రుళ్లిరాలే సుక్క రా

మొయ్యరా దారాన ముత్యం
మోస్తరు - అమ్మోర్ని మొయ్!
చల్లగా - అం - సాపుగా
సవ్వారి పాపం మొయ్యరా!
మొయ్యరా అత్తోరి ఇంటికి -
అమ్మోరి పల్లకి మొయ్యరా!

- 'ఏడాది పొడుగునా'

## 67

ఆవు రవురా నిజమేనా?
అవునా ఈ రాకలు ముత్తయిదువలేనా?

విర్రిగి ఇంద్ర ధనువు నేల కొరిగేనా, ఒరిగేనా?
విరి తీగకు నడక వచ్చి జరిగేనా, అరిగేనా?
సరి సరి, శ్రావణ మాసపు వరలక్ష్మిని కొలువ
పురులు విప్పి నెమిలి గుంపు తరలేనా, తరలేనా?

కమ్మగ సంసారమ్ములు గడిపే లాగున కోరి
అమ్మకు కై మోడ్చి వరము లిమ్మని అడిగేనా?
గుమ్మడి పండంటి కొడుకు నిమ్మని అడిగేనా?
అమ్మన్మథువంటి మగని తెమ్మని అడిగేనా?

# 68

ఓ దేవి! నీ ముందర ఒదిగి ఉన్నా మమ్మ!
ఏ దేని వర మడుగ ఎంతవారము, తల్లి!
పాదాల తల లనే పారిజాతము లుంచి,
మోదాన బాష్పాల ముత్తైసరు లుంచి -

జనని ! దయా రస హృదయా!
జలజ వనీ నిలయా!
జయా జయా ! శుభాశ్రయా!
జయా జయా ! హరి ప్రియా!

నొసట కలకాలమ్ము పసుపు కుంకుమ లుంచి,
నిసువు చిరునగవు దివ్వెల వీట వెలిగించి,
నసి చెడని సంసార మందార ముంచి,
బసచేసి మా ఇంట మసలవమ్మ మహాలక్ష్మి!

– 'ఏడాది పొడుగునా'

## 69

వెన్నెలా, వెన్నెలా, వెన్నెలో - ఓ
వెన్నెల్లి పూవత్తి వెన్నెలో - ఓ
రెల్లు పూలా వత్తి వెన్నెలో - ఓ
మల్లెపూలా వత్తి వెన్నెలో - ఓ

మల్లెల్లో కనబడదు వెన్నెలా - ఆ
తెల్లన్ని పూవత్తి వెన్నెలా!
మొల్లల్లో కనబడదు వెన్నెలా - ఆ
తెల్లన్ని పూవత్తి వెన్నెలా - ఆ

పాలకడలీ మరిగి వెన్నెలో - ఓ
నేలంత నురుగుల్లె వెన్నెలో!
కైలాసమూ కరిగి వెన్నెలో - ఓ
బైలంత ధూళుల్లె వెన్నెలో - ఓ

ఎవరు విసిరే రమ్మ వెన్నెలా? పాల
నురుగుల్లో కనబడదు వెన్నెలా! ఆ!
ఎవరు విసిరే రమ్మ వెన్నెలా? వెండి
ధూళుల్లో కనబడదు వెన్నెలా! ఆ!

- 'ఏడాది పొడుగువా'

## 70

చెప్పు మరదలా, చెప్పవే, ఈ
  చిక్కు విప్ప నీవే, నిజం!
తప్పు లేదు, నెల తప్పెనో? నీ
  చెరగు తిరగదేమే బుజం!

కళ్ళు ఆ వైపు తిప్పకే, ఉఁహుఁ -
  కాస్త చూడనీవే మొగం!
మెల్ల మెల్ల చిరునవ్వవే, ఆ
  పెదవి విరిచినట్లు సగం!

పులుపుపై మనసు పోయెనా, నీ
  తలపు తలపవేమో మది?
అలసటైతే కూచోరాదే, ఆ
  లేచి లేవనట్లు, ఎది?

ఒప్పుకోను మగపిల్లాడైతే -
  ఊరు కుందు వేమే, సరి సరి!
ఎప్పు డెప్పు డని కోడలి కోసం
  ఎదురు చూస్తు నమ్మా మరిమరి!

- 'ఏడాది పొడుగునా'

# 71

బా వొస్తే - బా వొస్తే - బా వొస్తే -
కుదురు మీంచి మెడ చాపి
మావిచెట్టు చూసేస్తే - చూసేస్తే -
గుమ్మంలో గోరింటకు
గుస గుస మని ఊదేస్తే - ఊదేస్తే -
తలుపు చాటు నుంచి ఎవరో
చల్ల చల్లగ వింటారు !

వినేస్తే - వినేస్తే - వినేస్తే -
కొండ మీంచి దివ్వె లొచ్చి
కూచుంటాయి కళ్లల్లో ! కూచుంటే -
పువ్వు లొచ్చి పొదనించి
పొంచుంటాయి పెదవుల్లో ! పొంచుంటే -
వాకిట్లో సందడి విని
లోని కెవరో వెడతారు !

వెళిపోతే - వెళిపోతే - వెళిపోతే -
ఆలస్యం చేశా డని
అంతలోనే బింకం వొచ్చి - బింకం వొచ్చి

అందరమూ చూశా మని
అంతలోనే బిడియం వొచ్చి - బిడియం వొచ్చి....

అంతట్లో ముంగిట్లో
అమాంతంగా బాజాలు
దడదడదడ ఢమఢమఢమ
తాషా మరపాలు!
సైఁ సైఁ సైఁ తూ తూ తూ
సన్నాయ్ బాకాలు!
బావకు అక్కకు మళ్లీ
పందిట్లో పెళ్లి!

# 72

పిలిచిందర్రా భోగిమంట!
ఈ చలితోటి వచ్చింది మహా పెద్ద తంట!

ఈ పక్క కుదిపేటి ఉహు హుహుహు
ఆ పక్క కదిపేటి ఒహొ హొహొహొ
పాములై వెన్వెంట పాకి వణికిస్తుంది!

ఎండు టాకులు తెచ్చి వెయ్యండి - సరసర
మండేటట్లు కాస్త ఊదండి!
వెదురు పుల్లలు విరిచి వెయ్యండి - బిర బిర
ముదురు కట్టెలు పరచి విసరండి!

చలిచలి చలిచలి దుప్పటి
తాతకి తేరా కుంపటి!
ఉహుహుహు హుహుహుహు గొంగళి
అవ్వకి తేరా కంబళి!

కర్రి చీకట్లోన
కరిచేటి చలిలోన
ఎర్రని పాముల్లాగ
సర్రున చేతులు చాపి
పిలిచిందర్రా భోగిమంట!

# 73

క్రన్నెల్లారా! అన్నుల మిన్నల్లారా!
కొమ్మల్లారా! ముద్దు గుమ్మల్లారా!

కొలనీ లోనీ నీళ్లూ తెచ్చి
గోమయ మింత కలపండోయ్
చెరువూ లోనీ నీళ్లూ తెచ్చి
చేతులు కడిగి చల్లండోయ్

ముత్యా లుంటే మూటలు కోసి
రత్నా లుంటే రాసులు పోసి
ముంగిలి ముంగిలి కలిసే లాగ
ముగ్గుల బారులు తీర్చండి!

తీవల్లాగ, తమ్మి పూవుల్లాగ -
తీవల్లాగ, బంతి పూవుల్లాగ -

విచ్చీ విచ్చని చేమంతుల్లా
పచ్చని ఆకుల మురిసేరే!
అందపు కడాని పూబంతీనీ
పందిట్లోనే వెతికేరే!

వచ్చినప్పుడే కొలవం డవె మన
వాకిట్లోనే గొబ్బిళ్లూ -
గొబ్బియళ్లో... గొబ్బియళ్లో....

# 74

నీరు చల్లిన ముంగిట్లో - ప
న్నీరు చల్లిన వాకిట్లో
దారి పొడుగునా ముగ్గుల్లు ! ము
త్యాలు పోసినా ముగ్గుల్లు ! ఆ
దారి పొడుగునా సొరుగా, ము
త్యాల ముగ్గులా గొబ్బిళ్లు ! ర
త్నాల ముగ్గులా గొబ్బిళ్లూ !
నారు పోసిన ముంగిట్లో - గ
న్నేరు పూచిన వాకిట్లో
బారు బారుల బంతుల్లు - ఆ
చేరు లయి చేమంతుల్లు ! బం
గారు రేకుల బంతుల్లో చే
మంతుల్లోపల గొబ్బిళ్లూ !
నీరు చల్లిన ముంగిట్లో - ప
న్నీరు చల్లిన వాకిట్లో
నారు పోసిన ముంగిట్లో - గ
న్నేరు పూచిన వాకిట్లో
జారు జడలా కన్నెల్లూ - ఒ
య్యారి నడలా కన్నెల్లూ - ఒ
య్యారి నడలా జారు జడలా
కన్నె [illegible] గొబ్బిళ్లూ !

[illegible]ధి పొడుగునా'

# 75

ఏ పుట్టా దాగేవు? ఎంత పిలిచినా రావు -
నాగన్నా! ఓ నాగన్నా!
ఈ బుట్ట నీ కోసం అల్లే నన్నా!

ఈ బుట్ట నీ కోసం అల్లే నన్నా!
ఈ తేనె ఈ పాలు నీకే నన్నా!

కను మూసే ఉడతల్ని కని పెట్టి కాపాడే
గన్నేరు పొదకాడే ఉన్నావా నాగన్నా?

వెండి తీగ లాగ, వెన్నెల రేక లాగ
వెలగ పూ వాకలా రావన్నా ఓ నాగన్నా!

- 'ఏడాది పొడుగునా'

రండమ్మ, హంసలూ! రామచిలకల్లు!
పండక్కి మా ఇల్లు పచ్చ తోరణము!
ఆ హంస లెవరో? ఆ చిలక లెవరో?
'హంసలే మా ఇంటి ఆడపడుచుల్లు!
చిలకలే మా ఇంటి చిట్టికోడళ్ళు!'
రండీ, పనసపండ్లు! రండి, గుమ్మళ్ళు!
పండక్కి మా ఇల్లు పచ్చతోరణము!
ఆ పనస లెవ రమ్మ? ఆ గుమ్మ డెవరె?
'పడుకుంటె అమ్మాయి పనసపండమ్మ -
కూచున్న అబ్బాయి గుమ్మడే నమ్మ!'
రండి, మారాజులు! మా గొప్ప దొరలు!
పండక్కి మా ఇల్లు పచ్చతోరణము!
ఆ రాజు లెవ రమ్మ? ఆ దొరలు ఎవరో?
'అందలంపై రాజు లన్న లౌతారు,
అటక పైనా దొరలు అల్లు రౌతారు!'
రండి, ఓ శ్రీదేవి! రండి, భూదేవి!
పండక్కి మా ఇల్లు పచ్చతోరణము!
శ్రీదేవి ఎవ రమ్మ? భూదేవి ఎవరు?
'మా ఇంట మసలేటి మగువ శ్రీదేవి -
మ మ్మేలు ఇల్లాలు మాకు భూదేవి!'

## 77

నవ్వంటే జాబిల్లి – పువ్వంటే మల్లి!
నవ్వేటి పువ్వంటే నా చిట్టి తల్లి!
దొంగా కళ్లల్లో తొగల రేకుల్లో
తుమ్మెదలు మెదలు మళ్లీ మళ్లీ!

చిలిపి కళ్లమీద చెక్కిళ్ల మీద
ముంజేత కాటుకలు ఎవరు పూసేరో!
మళ్లీ మళ్లీ మళ్లీ నా చిట్టి తల్లీ!

కాకమ్మ మేకమ్మ కథ చెప్పినాను
ఊఁ కొట్టె తాను
రాకాసి దోబూచి రాకుండా చూసి,
జోకొట్టినాను

అవంత ఆలాగు అరిగొచ్చే నరికి
దొంగ కళ్లల్లోను తుమ్మెదలు మెదలు!
మళ్లీ మళ్లీ మళ్లీ నా చిట్టి తల్లీ!

పువులూ కాయలు అల్లి, చిలకల్లు అల్లి
సవరించి పానుపున ఆ పాల వెల్లి

వాళ్లమ్మ ఆలాగు వెళ్లొచ్చేసరికి
కళ్ల, చెక్కిళ్లా కాటుకలు పాకె!
మళ్లీ మళ్లీ మళ్లీ నా చిట్టి తల్లీ!

మీ అన్న కళ్లేమొ నీలాల పైని
నీ దొంగ కళ్లేమొ దూలాల పైని
నీ నాన్న కళ్లేమొ బాలల్ల పైని
మళ్లీ మళ్లీ మళ్లీ నా చిట్టి తల్లీ!

'ఏడాది పొడుగునా'

## 78

నిదుర పోవే తల్లి
నిదుర పో నవమల్లి!
నిదుర పో జాబిల్లి
నిదుర పో వమ్మా!

కోటి కన్నులు మూసి
కునికె నాకాశమ్ము
ఆట పాటలలోన
అలసె లోకమ్ము! నిదుర....

ఏటి తరగల నడిగి
తోట పూవుల నడిగి
కలలు తెచ్చా నమ్మ
కను మూయ వమ్మా! నిదుర....

నీ కనుల రేకుల
నీడలే పొంచేను
నా కన్న తన అమ్మ
ఒడిని పవళించేను! నిదుర....

## 79

మూసే నీ కనుల, ఎవరు
పూసేరో నిదుర ?
ఆ సంపెగలో కునుకును
అంది తెచ్చె అదెర!                    లాలీ ....

చెట్టులోని చిరుగాలులు
చేమంతికి వాలు !
చెరువులోని కెరటాలు
చెంగల్వకు వాలు !

చిట్టికి బంగారు గొలుసు
తొట్టియె కావాలి, ఆ
తొట్టె నెపుడు వాళ్ళమ్మే
పట్టుకు ఊపాలి !                    లాలీ....

# 80

పెళ్లంటే జల్లు మంటది - నా మనసు
పిల్లంటే పరుగులేత్తది - ఎంచక్కా
పిల్లంటే ఉరకలేత్తది!

పావురా పిట్టలా, గాలిలా పరుగేసి
లేడిలా, జోడెద్దు బండిలా ఉరకేసి
పెళ్లంటే గంతులేత్తది - నా మనసు
పిల్లంటే ఉరకలేత్తది!

ఊ రెలపల పుంతకాడ నూరి నడిసి పోతుంటే
నారి బలే సోకుచేసి దారమ్మట పోతుంటే
ఓర కళ్లకేసి చూసి కోరమీసం దువ్వా
దోర పెదిమికేసి చూసి సిలిపి నవ్వ నవ్వా
ఇకిలించా, సకిలించా
యెదవ దగ్గు దగ్గా -

నన్ను సూసి బెదిరి పోతది - నా మెల్ల
కన్ను చూసి సెదరి పోతది - పెతిపిల్ల!
పెళ్లంటే ...

జో డెద్దు ల్లేకుండా
జోడు సెక్రా ల్లేకుండా

ఏడకు తా నెల్ల నంటది - నా కర్మం
ఈ బండీ కదల నంటది!
ఏ పిల్లా ఒల్ల నంటది - ఏం చెయను?
నా పాపం, అల్లా గుంటది!

సలవ మడత,
వాలు గోసి;
లంక సుట్ట, కిర్రు సెప్పు -
పెళ్లికొడుకు తయారయాడు - ఏమయినా
పిల్ల మాత్రం ఒల్ల నంటది - ఏం చెయను?
నన్ను సూసి గొల్లు మంటది!

# 81

నడపవ బండీ, బావ, నడపవ బండీ!
చల్లని గాలీ, పైని నల్లని మబ్బూ
ఆ - గాలి కన్న త్వరగా, ఆ - మబ్బుకన్న వడిగా

కదలదు బండీ, పిల్ల! మెదలదు బండీ
చల్లని గాలీ, పైని నల్లని మబ్బూ
పచ్చని తీగా, పైని విచ్చిన పూవూ!
కుచ్చులు తూగూ, అదిగో గుత్తులు ఊగూ!

గణ గణ లాడే మెళ్ళో మువ్వల గంట!
గున గునలాడే కొమ్మ గువ్వల జంట!
మరి మరి పాడే వలపు మనసుల జంట!

బెదరకు పిల్లా! గుండె చెదరకు పిల్లా!
వంకర పుంతా, కొండ వాకల చెంతా
తోటల పొంతా, మావి తోపుల కంతా
చీకటు లొస్తే, మబ్బు కాటుక లొస్తే

అదరను బావా, బండీ నడపవ బావ!
మొగలో నువు కూచుంటే, దిగు లెందుకు బావా?
జోడుగ మన ముంటే, ఇక తో డెందుకు బావా?
ఈ డెద్దుల బండీ, జో డెద్దుల బండీ
ఈడూ జోడూ, ఈ జంటా ఎక్కి పోయె!

## 82

జయ జననీ! ప్రియ జననీ!
  జయ జయ మహాంధ్ర ప్రియజననీ!

జయ జయ భారత దేవీ నందన!
శత శత మానవ హృదయ స్పందన!
సుకవి వనప్రియ నికర మధూదయ!
మధుర గేయ పరిచుంబిత చరణా!

శ్యామల శాద్వల వల్కలా!
కోమల కుసుమలతా చల కుంతల!
కామ లానిల చామరా! శ్రీ
మందిర! సుకళా సుందర!
సువిశాల వసుంధర!

జయ హారీ కృత దివ్య ధునీ!
జయ జయ నిత్య వసంత వనీ!
జయ జయ అక్షయ కనక ఖనీ!
జయ కోటిత్రయ హృదయ మణీమయ
  కటక కలాపిని!

## 83

తెలుగు తల్లికి మంగళమ్! మా
కల్పవల్లికి మంగళమ్!
కొలుచు మా యెద నిలుచు మా
రాజ్ఞీ మతల్లికి మంగళమ్!

ప్రాత క్రొత్తల కౌగిలింతల
ప్రసవమగు బంగారు కాంతుల
భావికాల స్వర్గ మమరుచు
ప్రౌఢ ప్రతిభకు మంగళమ్!

నాగరకతను వలచి మెచ్చిన
నాడునాడులు తరలి వచ్చిన
భోగ భాగ్యము లంద జూపే
రాగరహితకు మంగళమ్!

వేద వేదము లన్ని తరచీ
వాద భేదము లన్ని మరచీ
స్వాదు ధర్మ పథమ్ము పరచు
విశాల శీలకు మంగళమ్!

నాక మందిన పగటివేళ,
నరక మంటిన కారు రేల
ఏక గతి తెలుగమ్మ నడపిన
ఏక యంతకు మంగళమ్!

# ప్రథమ పాద సూచి